


నెహ్రూ బాల పుస్తకాలయం— 55

# బంగారు పిలక

సంకలనం

తురగా జానకీరాణి

చిత్రాలు

భావరాజు సత్యమూర్తి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూఢిల్లీ

# బంగారు పిలక

—చింతా దీక్షితులు

'తాతయ్యా, నాకో కథ చెప్పవూ ?'

'ఏం కథ చెప్పమంటావు ?

'పిలక కథ తాతయ్యా !'

'అనగా అనగా ఒక ఊళ్లో ఒక బ్రాహ్మడుండేవాట్ట. ఆ బ్రాహ్మడికి బంగారు పిలక ఉండేదిట!....'

'అదేమిటి తాతయ్యా, బంగారు పిలకలుంటాయా ఎవరికేనా ?'

'అవునురా—చెప్పడం మరచిపోయాను. వెనకటి కాలంలో ఎవరికే పిలక కావలిస్తే వాళ్లు ఆ పిలక చేయించుకొనేవారట....'

'అదేమిటి తాతయ్యా—పిలకలు చేయించుకొంటారా ఎక్కడేనా ?'

'ఆ కాలంలో చేయించుకొనేవారట! ఇప్పటికి మల్లె అప్పుడు పిలకలు తలకు అంటుకొని ఉండేవి కావట. ఎవరి పిలక వారు తీసుకొని, మంచి మంచి నూనెలు రాసి దువ్వి, జడలు వేసుకొని తలకు అంటించు కొనేవారట. కొందరు బంగారు పిలకలూ, కొందరు వెండివీ, కొందరు రాగివీ చేయించుకొనేవారట. ప్రతి రోజూ అవి తీసి తోముకొని మళ్లీ అందంగా తలకు తగిలించుకొనేవారట.

ఒకనాడు బ్రాహ్మడు అత్తారింటికెళ్లాలని ముస్తాబై బంగారు పిలక అంటించుకొని వెడుతున్నాట్ట. తోవలో ఓ అడవి ఉంది. ఆ అడవిలోంచి వెడుతూంటే ఒకచోట ఓ గొర్రెల మందను కాసుకుంటూ ఒక గొల్లవాడు నిలబడ్డాడు. గొల్లవాడు పరధ్యానంగా ఉండడం చూసి ఒక నక్క గొర్రెపిల్ల నొకదాన్ని పట్టుకుపోవడానికి పొంచుండి చూస్తోంది. దాన్ని గొల్లాడు చూడ

లేదు. బ్రాహ్మడు చూచి 'గొల్లాడా గొల్లాడా! నీ గొర్రెపిల్లని పట్టుకుపోవాలని చూస్తోంది ఆ నక్క—చూశావా?' అన్నాడు. గొల్లవాడు తిరిగి చూచి కర్ర పుచ్చుకొని నక్కమీదకు విసిరాడు. కర్ర నక్క కాలికి తగిలింది. అది పారిపోయింది. బ్రాహ్మడి మీద నక్కకు కోపం వచ్చింది. బ్రాహ్మడి మీద కసి తీర్చుకోవాలనుకుంది నక్క.

బ్రాహ్మడు అడవిలోంచి వెడుతున్నాడు. అతనికి కనిపించకుండా నక్క అతని వెనకనే వెడుతోంది. ఇంతట్లో సాయంత్రం అయింది.

బ్రాహ్మడు సంధ్య వార్చుకోవాలనుకొన్నాడు. అక్కడో చెరువుంటే ఆ చెరువులోకి దిగి సంధ్య వార్చుకోవచ్చునుగదా అనుకొన్నాడు. అనుకొని, బంగారు పలక ఒడ్డున పెట్టి, కాళ్లు కడుక్కోడానికి చెరువులోకి దిగాడు. దిగి, కాళ్లూ చేతులూ కడుక్కొని, పైకివచ్చి చూచేసరికి పలక లేదు.



'అన్నా! ఎంతపని జరిగింది! అత్తవారు పెట్టిన నిక్షేపంలాంటి పిలక పోయింది. ఇంక ఏమొహం పెట్టుకొని అత్తవారింటికి వెళ్లను? ఎవరు తీసి వుంటారు నా పిలక? ఇక్కడ మనిషి సందడేనా లేదే?' అనుకొని బ్రాహ్మడు చుట్టుపట్లంతా వెతకడం మొదలుపెట్టాడు. ఎక్కడా పిలక చిక్కలేదు కాని చెరువు ఒడ్డుమీద తాను పిలక పెట్టిన చోట నక్క కాలి అడుగులు ఉండడం చూచి, 'ఈ నక్కగానీ పిలక పట్టుకుపోయి ఉంటుందా!' అనుకొన్నాడు.

దాని కాలి అడుగుల జాడను బట్టి మెల్లిగా వెడుతున్నాడు. భూమి మీద కళ్లు పెట్టుకొని ఇటూ అటూ చూడకుండా వెడుతూంటే అతనికి ఒక సెట్ల దుబ్బులో అలికిడైనట్లయింది. గాండ్రు గాండ్రుమని శబ్దము విని పించింది. తటాలున ఆగాడు. ఆ దుబ్బులోనుంచి ఒక పెద్దపులి వచ్చి అతనికి ఎదురుగా నిలబడింది.

బ్రాహ్మడు గజగజ వణికిపోతున్నాడు. చేతులు జోడించి పెద్దపులికి దణ్ణం పెడుతూ అన్నాడుగదా—'పులిరాజా పులిరాజా! నేను బ్రాహ్మణ్ణి; నన్ను వదిలిపెట్టు; నీకెంతో పుణ్యం వుంటుంది. నీవు ఈ అడవికి రాజువు. నీకు కావాలంటె ఎన్ని మృగములు లేవు. ఈ బ్రాహ్మడే కావాలా తిన డానికి—నీకు పదివేల దణ్ణాలు నన్ను వదిలిపెట్టు' అని బ్రాహ్మడు సాష్టాంగపడ్డాడు. పెద్దపులి అతన్ని చూచి, నవ్వి 'లే బ్రాహ్మడా లే! నాకు ఆకలి లేదుకాని దాహం ఎక్కువగా ఉంది. నీ మెడ దగ్గిర నరం నెమ్మ దిగా కొరికి నీ రక్తం తాగి దాహం తీర్చుకొని వెడతాను. తరవాత నీ దారిన నీవు వెళ్లవచ్చు, లే!' అంది.

'ధర్మమా పులిరాజా, బ్రాహ్మడి రక్తం త్రాగడం? బ్రహ్మహత్యా దోషానికి ఒడిగడతావా యింత రాజ్యమూ ఏలుతూ?' అన్నాడు బ్రాహ్మడు.

'అయ్యో! వెర్రి బ్రాహ్మడా, మీ మనుష్యులకు మల్లే మాలో జాతి మత భేదాలు లేవు. నలుపు తెలుపు తేడాలు లేవు. మా కంటికందరూ ఒక్కటే. కాబట్టి నీ రక్తం తాగక మానను!'

'అమ్మయ్యో! నన్ను రక్షించు పులిరాజా' అన్నాడు బ్రాహ్మడు. పెద్దపులి కోపంతో బ్రాహ్మణ్ణి సమీపించి మెడ కొరకబోతూంటే అన్నాడు

గదా బ్రాహ్మడు 'ఆగు ఆగు పులిరాజా ఆగు, ఆగు!' అని.

'ఎందుకు, ఎందుకు?' అంది పులి.

'ఒక ధర్మసూక్ష్మం ఉన్నది.'

'ఏమిటది?'

'నేను చెప్పనూ చెప్పాను, నీవు చూడనూ చూచావు—నాకు పిలక లేదనే సంగతి. పిలక లేని బ్రాహ్మణ్ణిగాని, యితర కులస్థుణ్ణిగాని పులులు తినకూడదని ధర్మ శాస్త్రం ఉన్నది. అది నీవు మరచి ఉంటావు. ఎట్లాగా నన్ను చంప నిశ్చయించావు కాబట్టి ఒక ఉపాయం చెప్పతా విను!'

'అవును బ్రాహ్మడా, అమాట నిజమే. చెప్పు, ఆ ఉపాయం ఏమిటో?'

'ఏమీ లేదు. నేను కాళ్లు కడుక్కుంటూంటే ఒక మాయనక్క వచ్చి నా బంగారు పిలక ఎత్తుకుపోయింది. మనం ఇద్దరమూ వెళ్లి దాని వద్దనుండి పిలక పుచ్చుకొందాము. నేనా పిలక పెట్టుకొంటాను. తరవాత నా రక్తంతో దాహం తీర్చుకొందువుగాని నువ్వు' అన్నాడు బ్రాహ్మడు.

పులి సరే పదమంది. పులీ, బ్రాహ్మడూ కలిసి అడివిలోంచి వెదుతున్నారు. ఎంత వెదికినా వాళ్లకు నక్క ఉండే జాడ కనిపించలేదు. ప్రతి కన్నమూ, ప్రతి పొదా చూస్తున్నారు. నక్క కనిపించలేదు. పులికి దాహం ఎక్కువౌతోంది. బ్రాహ్మడికి భయం ఎక్కువౌతోంది.

చెట్టు కొమ్మ మీద నుంచి వీళ్లను చూస్తున్న ఒక కాకి అంది కదా 'పులిబావా పులిబావా! నువ్వూ ఆ బ్రాహ్మడూ కలిసి ఏమిటి వెతుకుతున్నారు?' అని.

'ఈ బ్రాహ్మడి పిలక నక్క ఎత్తుకపోయిందిట. దానికోసం వెతుకుతున్నాము' అంది పులి.

'మనకు పగవాళ్ళైన మనుష్యులతో స్నేహం చెయ్యవచ్చునా పులి బావా?' అంది కాకి.

'స్నేహం కాదమ్మా కాకమ్మా! నాకు దాహం వేస్తోంది. ఈ బ్రాహ్మడి రక్తం రవంత తాగి దప్పిక తీర్చుకుందామనుకుంటే ఆ పాడు పిలక ఎక్కడో పారేసుకున్నాట్ట. అది లేందే నేను మనుష్యుల్ని ముట్టుకోకూడదు కదా!'

'అలాగా? అయితే నే చెబుతా విను. ఇందాకా నేను ఆకాశం మీద షికారు తిరుగుతూంటే ఒక నక్క నోటితో పచ్చని వస్తువు ఒకటి కరుచుకొని పారిపోతోంది. దాన్ని నేనెరుగుదును.'

'ఐతే అది ఎక్కడ కాపరం?' అంది పులి.

'అదిగో, ఆ కనిపించే కొండ దగ్గిర చెట్టు వుంది. ఆ చెట్టు కింద ఒక పెద్ద బండ ఉంది. ఆ బండ కింద కన్నం వుంది. ఆ కన్నంలో కాపురం నక్క!' అంది కాకి.

'నీ మేలు మరవనుసుమా!' అంది పులి.

బ్రాహ్మడూ, పులీ కలిసి బండ దగ్గిరికి వెళ్లారు. కాకి కూడా వచ్చి చెట్టు మీద వాలింది.

బ్రాహ్మడికి గండం తప్పేటట్లు లేదు. ఎలాగ తప్పించుకోవడమా అని ఆలోచిస్తున్నాడు. ఇంతట్లోకే పులి అందికదా ...'అలా గుక్కిళ్లు మింగుతూ నిలబడతావేమిటి బ్రాహ్మడా, పిలు, ఆ నక్కను పిలు' అంది.

'నేను పిలిస్తే వస్తుందో రాదో, పులిరాజా! పిలక కోసం వచ్చి ఉంటానని అది తెలుసుకొని పలకదేమోనని భయం' అన్నాడు బ్రాహ్మడు.

'మీరు పిలిచినా భయపడి రాదు, ఈ కాకి పిలిస్తే నయం'.

కాకి సరేనని కన్నం దగ్గర బండమీద వాలి పిలవడం మొదలెట్టింది.

తలుపుతియ్యి, తలుపుతియ్యి నక్కబావా
చుట్టాలు వచ్చారు నక్కబావా!
కట్నాలు తెచ్చారు నక్కబావా
కడుపు నిండిస్తారు నక్కబావా!

నక్క కన్నంలో ఉండి తన పిల్లాడికి జడ వేసుకుంటోంది. జడ వేసి బంగారు పిలక ఆ పిల్లాడికి పెట్టాలని అనుకుంది. కాకి పిలుపు విని అంది కదా....

చుట్టాలు ఎవరమ్మ కాకమ్మా,
కట్నాలు ఏమిటమ్మ కాకమ్మా!
చెయ్యూరుకోలేదు కాకమ్మా,
జడ వేస్తున్నాను కాకమ్మా!

అంటే కాకి అందిగదా....

చుట్టాలు నేనేను నక్కబావా,
పక్కాలు నేనేను నక్కబావా!
కట్నాలు యివిగోను నక్కబావా,
కడుపునిండా తినవయ్యి నక్కబావా!

అంటే, నక్క ముక్కుతో బయట ఎవరున్నారో అని వాసన చూడ్డం మొదలెట్టింది. మొదట మనిషి వాసన కొట్టింది. ఈ మనిషి ఆ బ్రాహ్మడే కదా, పిలక కోసం వచ్చివుంటాడు అనుకొంది. తరవాత పెద్దపులి వాసన కొట్టింది. పెద్దపులితో చెప్పి దాన్ని తీసుకొని, బ్రాహ్మడు పిలక నాదగ్గిర్నుంచి పుచ్చుకోడానికి వచ్చాడనుకొని, కాకి మాటలు నమ్మరాదనుకొని అంది కదా....

చుట్టాలు వస్తేను కాకమ్మా,
గుట్టమీద పీటవెయ్యి కాకమ్మా!
చెట్టుమీద కూచోమను కాకమ్మా,
జడవేసి వస్తాను కాకమ్మా!

అంటే, పెద్దపులి వచ్చి గుట్టమీద కూర్చుంది. బ్రాహ్మడు చెట్టు ఎక్కాడు. కాకి కన్నం దగ్గిర కూచుని చూస్తోంది.

ఎంతకీ నక్క బయటికి రాలేదు. పెద్దపులికి కోపం వచ్చింది. గాండ్రు గాండ్రుమంటూ అరుస్తూ అందికదా—'నక్కా నక్కా, నీవు బయటికి వస్తావా రావా? నాకు దాహంగా వుంది. నువ్వు రాకపోతే నిన్ను చంపేస్తాను. జాగర్త!'

అప్పుడు నక్క 'ఎందుకంత కోపం పులిబావా! దాహం వేస్తే కాఫీ కాస్తున్నా, తెస్తా ఉండు. ఇంకా ఎవరున్నారు అక్కడ!' అంది.

'నేనూ, బ్రాహ్మడూ, కాకీని—చప్పున బంగారు పిలక పట్టుకు బయటికి రా!' అంది పులి.

అప్పుడు నక్క ఆలోచించి అనుకొందికదా 'ఈ ముగ్గురూ పిలక కోసమే వచ్చారు. నన్ను చంపాలనే వీళ్ల ఉద్దేశం. ఈ పిలక నా దగ్గర ఉంటే ఎప్పటికైనా వీళ్లు నన్ను వదలిపెట్టరు. ఎందుకీ పాడు పిలక నాకు? ఇక్కడ పారేసి పిల్లలతోకూడా పెరటి దారిని పారిపోతా!' అని.

ఇట్లా అనుకొని నక్క పిలక అక్కడనే వదిలిపెట్టి వెళ్లిపోతూ ఇలా చెప్పింది—

> వస్తూంటి వస్తూంటి పులిబావా,
> పళ్లుకొరికి ఎగరబోకు పులిబావా!
> పిల్లలకు జడవేసి పులిబావా,
> పళ్లూ కాఫీ తెస్తాను పులిబావా!

కాకీ, పులీ చాలాసేపు కూర్చున్నారు అక్కడే. బ్రాహ్మడు చెట్టు చివరి కొమ్మమీద కూర్చున్నాడు. ఎంతకూ రాకుంటె పులీ, కాకి మళ్లీ పిలిచారు. సమాధానం లేదు. నక్కమీద పులికి కోపం వచ్చి, దాని కన్నం గోళ్లతో పెల్లగించి వేసింది. నక్క లేదు, మోసం చేసి పారిపోయిందిగదా అనుకొని ఇంకోమారు దాని పని పట్టవచ్చుననుకొన్నది. కాకీ, పులీ కలిసి కన్నం అంతా వెదికితే బంగారు పిలక దొరికింది. కాకికి, పులికీ సంతోష మైంది.

'దొరికింది, బ్రాహ్మడా నీ బంగారు పిలక! అదృష్టవంతుడివి! పోతే పోయిందిలే వెధవ నక్క—రా, దిగు—ఈ పిలక పెట్టుకో—నాకు మరీ దాహంగా ఉంది—నాలిక పిడచగట్టుకుపోతోంది. చప్పున పిలక పెట్టుకో!' అంది పులి.



బ్రాహ్మడికి సగం ప్రాణం పోయింది. ఇలా అన్నాడు :

'నేరక ఈ చిట్టచివర కొమ్మమీద కూర్చున్నాను. ఇప్పుడు ఎలాగ దిగడమో తెలియడం లేదు. నేను పిలకగాని పెట్టుకుంటే దిగగలనేమో? పెద్దలు చెబుతారుగదా—పిలక సగం బలం అని. కాబట్టి కాకమ్మా! ఆ పిలక రవంత యిట్లా తెచ్చిపెడితివా నీకు పుణ్యం ఉంటుంది. నేనా పిలక పెట్టుకొని నెమ్మదిగా చెట్టు దిగుతాను.'

'దిగకపోతేనో?' అంది కాకి.

'దిగక ఎక్కడికి పోతానమ్మా? భూమిమీద పులిరాజూ, ఆకాశం మీద నువ్వూ, మధ్య నేనూను—ఎక్కడికి పోతాను?'



కాకి ముక్కుతో పిలక తెచ్చి బ్రాహ్మడికి యివ్వబోతూంటే బ్రాహ్మ డన్నాడు గదా, 'ఈ రెండు చేతులతోనూ ఈ చెట్టుకొమ్మలు పట్టుకొన్నాను. పిలక ఎలాగ పెట్టుకోగలను? నువ్వే రవంత పెట్టి పెడుదూ!' అని.

అంటే, కాకి బ్రాహ్మడి తలకు పిలక తగిలించింది. తగిలిస్తూంటే బ్రాహ్మడు తటాలున దాన్ని పట్టుకొని తన బట్టలో మూటగట్టి కింద పడ వేశాడు. పిలక బాగా తగిలించుకొని కూర్చున్నాడు.

'అదేమిటి బ్రాహ్మడా, ఆ కాకిని మూటగట్టి కింద పడవేశావు. నీవు మోసగాడివలె ఉన్నావే?' అంది పులి.

'రామ రామా! నేను మీపట్ల మోసం చేస్తానా? చేసి ఎక్కడికి వెడతాను? మీకు దాహం ఎక్కువగా ఉన్నదన్నారుగదా, నేను దిగేలోపుగా ఈ కాకి రక్తం కొంచెం పీల్చి దాహం తీర్చుకుంటారని పడవేశాను. ఇష్టం లేకుంటే మూట విప్పివెయ్యండి' అన్నాడు బ్రాహ్మడు.

'నీ రక్తం కావాలి నాకు, కాకి రక్తం కాదు' అంది పులి.

'ఐతే దిగుతున్నా; కాని ఒక సందేహం మనస్సుని బాధిస్తోంది. ఇప్పుడు రెండు జాముల రాత్రి అయింది. పొద్దున పంచాంగం చూశాను. సరిగ్గా ఇది వర్జ్య సమయం. ఈ వర్జ్య సమయంలో చెట్టు దిగడానికి కాళ్లూ చేతులూ అడ్డం లేదు. అంతే కాకుండా ఈ వర్జ్య సమయంలో మీరు నా రక్తం తాగితే ఏ కడుపునొప్పో వచ్చి బాధపడతారో అని నాకు దిగులుగా ఉంది!'

'అన్నా! ఏంత మోసగాడివి నీవు—ఉండు నీ సంగతి చూస్తాను. చిరతపులిని పిలిచి నిన్ను కిందకు లాగించకపోతే నా పేరు పెద్దపులి కాదు.'

'ఎందుకు పులిరాజా! నామీద నీలాపనిందలు వేస్తారు—ఇక నాలుగు ఘడియలకు వర్జ్యం పోతుంది. పోయీ పోవడంతోనే నేను చెట్టు దిగుతాను. తరవాత నా రక్తం మీరు తాగవచ్చు.'

'సరే, నేనీ చెట్టు మొదటే కూర్చుంటాను. నీవు ఎక్కడికి పోతావో చూస్తానుగా' అంది పులి. చెట్టు మీద బ్రాహ్మడూ, చెట్టు క్రింద పులీ చాలా సేపు కూర్చున్నారు.

కొంతసేపైన తర్వాత అన్నాడు కదా బ్రాహ్మడు, 'ఏదో దూరాన్ని అలుకుడౌతోంది పులిరాజా, వినిపిస్తోందా?' అని.

'చెట్టుమీద ఉన్నావుకదా—అదేదో చూచి చెప్పు' అంది పులి. అప్పుడా బ్రాహ్మడు అన్నాడు....

మందలు మందలు, జింకల మందలు
మందలు మందలు లేళ్ల మందలు !
పచ్చని వళ్లూ చుక్కల వళ్లూ
సన్నటి కాళ్లూ గుండ్రని కళ్లూ,
అన్నీ మందలు, అవిగో మందలు !
మందలు మందలు జింకల మందలు !
మందలు మందలు లేళ్ల మందలు !!
మందలు మందలు, మందలు మందలు !!!

'ఎక్కడ, ఎక్కడ? ఆ మంద ఎక్కడ, బ్రాహ్మడా? సరిగా చూచి చెప్పు' అంది పులి ఆశతో. బ్రాహ్మడన్నాడు గదా....

కొండల దాపున సరస్సు దగ్గిర
లోయల్లోపల పొదల చాటునా,
సూటి కొమ్ములూ కొమ్ముల కొమ్ములూ
పదును గిట్టలూ నిండు పొట్టలూ
మందలు మందలు జింకల మందలు !
మందలు మందలు లేళ్ల మందలు !!
మందలు మందలు మందలు మందలు !!!

'నిజంగానేనా, బ్రాహ్మడా?' అంది పులి తొందరగా.

'నిజమేనయ్యా. ఎంత కన్నుల పండుగ! ఎన్ని జింకలు. ఎన్ని జింకలు!'

ఉత్సాహంతో ఉరుకుతున్నవి
గబగబ గబగబ గెంతుతున్నవి
గిరగిర గిరగిర తిరుగుతున్నవి
చంగు చంగునా ఎగురుతున్నవి
తళతళ కళ్లు గిరగిర తిరగా
పచ్చిక కొంచెం కొరుకుతున్నవి!
మేమే అంటూ అరుస్తున్నవి
సరస్సు నీళ్లు తాగుతున్నవి!
మందలు మందలు జింకల మందలు
మందలు మందలు లేళ్ల మందలు
వేలూ లక్షలు, కోట్లు మందలు
మందలు మందలు మందలు మందలు!

బ్రాహ్మడు పాడుతూంటే పులికి నోరూరుతోంది. ముక్కుతో వాసన చూచింది. కొంచెం జింకల వాసన కొట్టినట్లయింది. చెవులు నిక్కించి విన్నది. కొంచెం అలుకుడు కూడా వినిపించినట్లయింది.

బ్రాహ్మడు మళ్లీ....

ఆకాశంలో చుక్కల మిలమిల
కొండ దాపులో జింకల మిలమిల!
అడివి అంతటా జింకల కలకల!!
దుబ్బుల్లోనూ, చెట్ల పక్కనా
బండల మధ్యా, సరస్సు దరినీ
మైదానంలో, చరియల్లోనూ
కిందా మీదా, ముందూ వెనకా
ఔరా మందలు జింకల మందలు!

ఆడ జింకలూ, పిల్ల జింకలూ
పొడల జింకలూ, పొట్టి జింకలూ
మందలు మందలు జింకల మందలు !
మందలు మందలు లేళ్ల మందలు !!
మందలు మందలు మందలు మందలు !!!

పెద్దపులి బ్రాహ్మడు పాడిన పాట విని చెట్టుకింద ఉండలేక పోయింది. రంయిన బయలుదేరి ఉరుకుతూ కొండలకేసి పరుగెత్తుకు పోతూంటే బ్రాహ్మడు గట్టిగా ..

ఒకటా రెండా మూడా నాల్గా
వందలు వేలు లక్షలు కోట్లు !



కొండల చుట్టూ కెరటాలా అవి
సుడిగుండాలా సముద్రం పోటా?
మందలు మందలు జింకల మందలు !

అని పాడుతూనే వున్నాడు. పెద్దపులి మాయమయింది.

తెల్లవారింది. జాము పొద్దెక్కేదాకా బ్రాహ్మడు చెట్టు మీద కూర్చుని, తరువాత చెట్టు దిగి, మూటవిప్పి కాకిని వదిలిపెట్టి, కండువా తీసికొని, బంగారు పిలక సరిగ్గా ఉందో లేదో చూచుకొని అత్తారింటికి నడిచి పోయాడు....

'అయిందా, తాతయ్యా కథ?'

'అయిందిరా, యింక పడుకో!

'మరి పెద్దపులి ఏమయింది?'

'జింకల్ని వేటాడి కడుపు నిండాక తన గుహలో నిద్రపోడానికి పోయింది.'

'బ్రాహ్మడున్న చెట్టు దగ్గిరికి రాలేదూ?'

'పగటి వేళ పులులు తిరగవు. వాటికి నిద్ర వస్తుంది. గుహలోకి పోయి నిద్రపోతాయి.'

కథ కంచికి వెళ్లింది. తాతయ్య పక్కలో అబ్బాయి నిద్రపోయాడు.

—

# కోతి

—కలువకొలను సదానంద

కోతి బుద్ధిగా, ఒకచోట కూర్చుని వుండడమో, అల్లరి లేకుండా నెమ్మదిగా వుండడమో—ఎవరైనా చూశారా? ఎవరూ చూసివుండరు. కోతి మహా అల్లరి. కొమ్మ మీదికి గెంతుతుంది. ఊడ పట్టుకుని జారుతుంది. పిల్లి మొగ్గ వేస్తుంది. కిచకిచలాడుతుంది. వెక్కిరిస్తుంది. పరుగెత్తుకెళ్ళి ఆకుల్లో దాక్కుంటుంది. వెంటనే మళ్ళీ యివతలకి పరుగెత్తుకొస్తుంది. అది ఒకచోట వుండదు. దానికి ఒక పనిలో నిమగ్నత వుండదు. దానిది నిలకడ లేని స్వభావం. ఔనా?.... ఇక కథ చదవండి.



అనగనగా ఒక యోగి. అతని పేరు సువర్ణయోగి. సువర్ణము అంటే బంగారము కదా! సువర్ణయోగి దగ్గర మామిడికాయంత బంగారం ఉంది. అతని దగ్గర అంత బంగారం వున్న విషయం అతని శిష్యుడికి తెలియదు.

గురుశిష్యులిద్దరూ ఊరూరు తిరుగుతుంటారు. ప్రతి పుణ్యక్షేత్రాన్ని దర్శిస్తూవుంటారు. ప్రతి తీర్థంలోను మునుగుతుంటారు. కనిపించిన ప్రతి వింతా చూస్తారు. ఒక వూరినుండి మరో వూరికి సాగిపోతుంటారు.

ప్రతిరోజు ఉదయం సువర్ణయోగి కాలకృత్యాలు తీర్చుకొని, స్నాన మాడి, సంధ్యావందనం ముగించి—శిష్యుడి చేతికి గురివెంద గింజంత బంగారమిచ్చి అమ్మికు రమ్మంటాడు. శిష్యుడు దాన్ని అమ్మి, వంటకు కావలసిన సరుకు అంతా కొనుక్కువచ్చి వంట చేస్తాడు. గురువుగారికింత పెడతాడు తానింత తింటాడు.

ఇలా వుండగా—శిష్యుడికి ఒక గొప్ప సందేహం పట్టుకుంది. ఈ సువర్ణయోగి రోజూ గురివెంద గింజంత బంగార మిస్తాడే.... ఈయన కింత బంగారమెక్కడిది? దీని అంతు కనుక్కోవాలి....

ఓరోజు గురువుగార్ని అడిగేశాడు 'స్వామీ! యిలా అడుగుతున్నందుకు క్షమించండి. మీరు రోజూ ఖర్చులకని బంగారం యిస్తున్నారు. మీకీ బంగారం ఎక్కణ్ణుంచి వస్తున్నది?' అని.

ఆ ప్రశ్న వినేసరికి గురువుగారి గుండె గుభేలుమంది. దాన్నిగురించే ఆలోచిస్తూ ఆయన యిలా అనుకున్నారు. 'ధనంమీద కాంక్ష—మనిషి పాపపుణ్యాలు, మంచిచెడ్డలు అన్నీ మరచిపోతాడు. మనిషికి ఉన్నవి రెండు కళ్లు. ఇవి రెండు గాక మనకు కనబడని కన్ను మరొకటి ఉంది. అది జ్ఞాన నేత్రం. ఆ జ్ఞాన నేత్రం లేకపోతే మనిషి అజ్ఞాని అయిపోతాడు. బంగారం మీది మమకారం ఆ మూడో కన్నును పాడుచేసి, మనిషిని గుడ్డి వాణ్ణిగా చేసేయగలదు.'

అందుచేత నిజం దాచడం గురువుగారికి తప్పనిసరైంది. తన శిష్యు డేమో నమ్మదగినవాడే. అయినా తన బంగారాన్ని దొంగిలించబోడనీ, తన ప్రాణాలకే ముప్పు తలపెట్టడని నమ్మకమేముంది?

గురువుగారు ఒక అబద్ధమాడేశారు. 'శిష్యా! నాకు బంగారం తయారు చేసే విద్య తెలుసును. రోజూ మన అవసరాలకు సరిపోయేంత బంగారం మాత్రం తయారు చేస్తుంటాను.'

ఆరోజు నుండి శిష్యుడు గురువుగారికి అంగరక్షకుడైపోయాడు. ఆయన కాలితో చేయమన్న పని చేతితో చేసేవాడు. అతని కాళ్లు పట్టేవాడు. ప్రక్కన నిలబడి విసనగర్రతో విసిరేవాడు. దూరంగా కొండమీద శిష్యుడున్నాడనుకోండి. గురువు 'శిష్యా' అని కేక పెట్టాడంటే—ఆ కొండ తిరిగి 'శిష్యా' అంటూ ప్రతిధ్వనిస్తుంది. శిష్యుడు ఆప్రతిధ్వనికన్నా ముందుగా 'గురువుగారూ' అంటూ పరుగెత్తుకొచ్చేసేవాడు. గుళ్లో దేవుడు మనకందరికి దేవుడు. శిష్యుడికి గురువుగారే దేవుడు. కంటికి కనురెప్ప ఎలాగో, యోధుడికి కవచమెలాగో, గురువుగారికి శిష్యుడూ అలాగే. గురువుగారి అనుగ్రహం సంపాదించాలి. అతని నుండి బంగారం తయారుచేసే విద్య నేర్చుకోవాలి. తరువాత ఒక బంగారువాద నిర్మించేయాలి. ఆవాడను తాను ఏలుకోవాలి. ఇలాంటి కోరికలు మరెన్నో కలిగాయి అతనికి. బంగారం తయారు చేయడమెలాగో నేర్పకముందే గురువుగారు ఎక్కడ గుటుక్కుమంటాడో అన్న భయం కూడా ఉండేది.

ఒకనాడు గురువుగారు శిష్యుడితో—'నాయనా యిన్నాళ్లూ నువ్వు చేసిన శుశ్రూషకు నాకు చాలా సంతోషమైంది. ఇక నేను కాశీకి వెళ్లిపోవాలనుకుంటున్నాను. నానుండి నీకేమైనా కావలసివుంటే అడుగు, ఇస్తాను' అన్నాడు.

శిష్యుడు వినయంగా చేతులు నలుపుకుంటూ 'నాకు బంగారం చేసే విద్య నేర్పండి' అన్నాడు.

ఇది విని సువర్ణయోగి గుడ్లు తేలవేశాడు. అతనికి ఆవిద్య తెలిస్తేగా? కాని ఆ విద్య నేర్పందే—శిష్యుడు తన్ను వదలిపోడు. కాసేపు ఆలోచించగా అతనికి ఒక ఉపాయం తోచింది.

'శిష్యా! బాగా పసరు వచ్చే ఒక ఆకు పేరు చెప్పు' అన్నాడు.

'చిక్కుడు ఆకు' అన్నాడు శిష్యుడు ఆలోచించి.

శిష్యుడి చెవిలో ఏదో మంత్రోపదేశం చేశాడు గురువు. చేసి 'శిష్యా! ఇటుకరాయో, గులకరాయో ఏదో వొకటి తీసుకో! చిక్కుడు ఆకును బాగా నలిపి, నేను చెప్పిన మంత్రం ఉచ్చరిస్తూ రాతి మీద పసరు పిండు. ఆ రాయి కాస్తా బంగారమైపోతుంది' అన్నాడు.

శిష్యుడు పరమానందభరితుడైపోయి 'ధన్యోస్మి' అంటూ అతడి పాదాలు ముట్టుకున్నాడు.

'అయితే ఒక నియమం వుంది' అన్నాడు యోగి.

'ఏమిటి?'



'నువ్వు బంగారం తయారు చేసేటప్పుడు కోతిని మాత్రం తలచుకో వద్దు.'

'తలచుకుంటే?'

'బంగారం తయారుకాదు.'

'ఆమాత్రం జాగ్రత్తపడలేనా?' అన్నాడు శిష్యుడు.

గురువుగార్ని కాశీకి సాగనంపి, చిక్కుడుతీగె ఎక్కడుందా అని వెతికాడు శిష్యుడు. చిక్కుడుపాదు కనిపించనే కనిపించింది. శిష్యుడు నదిలో శుభ్రంగా స్నానం చేశాడు. ఒక గంపెడు రాళ్లు ఏరుకున్నాడు. చిక్కుడాకులు నాలుగు త్రుంచాడు. తాను పాటించవలసిన నియమం జ్ఞాపకం వచ్చింది. కోతిని మాత్రం తలచుకోగూడదు. ఆ కొంతసేపు కోతిని తలచుకోకుండా వుంటే బంగారం తయారైపోతుంది!.... .......మంత్రం పఠించాడు. కోతి జ్ఞప్తికి వచ్చింది. శిష్యుడు తన్నుతాను హెచ్చరించుకున్నాడు........ 'అదిగో! నియమం తప్పుతున్నావు. కోతిని మాత్రం తలచుకోకు....'

ఈసారి కోతిని తలచుకోకూడదనుకుంటూ మంత్రం వుచ్చరించాడు. పసరు పిండాడు. రాయి రాయిగానే వుంది.

'ఛీ! పాడు కోతి! కాస్సేపు జ్ఞాపకానికి రాకుండా ఉండలేదే....' అని తిట్టుకున్నాడు.

నోరు నొప్పి పెట్టేదాకా మంత్రం చదివాడు. చిక్కుడుపాదు ఖాళీ అయిపోయేంతవరకు పసరు పిండాడు. నియమం పాటించాలనుకున్నాడు. కోతి తలుపుకు రాక మానలేదు. బంగారం తయారు కాలేదు. 'కోతిజాతి నాశనం కానూ! కోతి అనే పదమే లేకుండా పోనూ' అని విసుక్కున్నాడు. 'ఈరోజు కోతిని మరచిపోతాను. రేపు కోతిని తలచుకోను' అనుకున్నాడు.

రోజూ అతడు బంగారం తయారుచేయబోయేవాడు. అతని బుర్రలో 'కోతి' మెదిలేది. 'గురువుగారు కోతిని తలచుకొకుండా యెలా వుండగలిగే

వారో?' అనుకునేవాడు. అతని కోరిక కోరికగానే వుండిపోయింది.

గురువుగారి విద్యాదానంలోని కిటుకును గ్రహించలేకపోయాడు శిష్యుడు. మనస్సు ఎటువంటిదో సువర్ణయోగికి తెలుసు. అది చంచలమైనది. దానికి నిలకడే లేదు. అందుకే గాబోలు—మనస్సును 'కోతి' అన్నారు పెద్దలు.

# భగవంతుని వారసులు

—మధురాంతకం రాజారాం

'అమ్మా అమ్మా! ఎదురింటికెవరో దండిగా మనుషులొచ్చారు. ఎందుకొచ్చారమ్మా వాళ్లు?' కుతూహలంగా ప్రశ్నించాడు చిట్టిబాబు.

కిటికీలోనుంచి ఒకసారి వెలుపలికి చూచి 'పనివాళ్లు లేరా చిట్టిబాబూ! ఇంటిని రిపేర్ చెయ్యడానికి వచ్చినట్టున్నారు' అంది పార్వతమ్మ.

'ఎందుకమ్మా రిపేర్ చెయ్యడం?'

'ఇల్లు పాడయిపోయిందికదరా మరి! గోడలకు కన్నాలు పడ్డాయి. గచ్చు లేచిపోయింది. ప్రహరీ అక్కడక్కడ కూలిపోయింది. పెరడు అడవిలా బలిసిపోయింది. వాళ్లదంతా బాగుచేసి వెళ్తారు.'

'ఎందుకమ్మా బాగుచెయ్యడం?'

'ఇప్పుడైతే అందులో ఎవరూ లేరనుకో; యిక మీదట అలా కాదు. ఎవరో పెద్దాయన ఆయింట్లో చేరబోతున్నాడు ...'

'ఎవరమ్మా ఆ పెద్దాయన?'

ఇలా కాదన్నట్టు పార్వతమ్మ కొడుకును పైకెత్తి కిటికీ అంచున నిల్చోబెట్టింది. 'చూడరా బాబు! పొడుగు చేతుల చొక్కా, లావాటి మీసాలు, తలలో వెంట్రుకలు సగంపైగా నెరసిపోయాయి. ఆయనే ఎదురింటికి రాబోతున్నది....'

'నేనెప్పుడూ ఆయన్ని చూడలేదు. ఎవరమ్మా ఆయన? ఏఊరు?'

'ఒరే చిట్టిబాబూ! నీ ప్రశ్నలన్నిటికి జవాబులు చెప్పడానికి నాకు తీరిక లేదు. పోయి మీ నాన్నగారినడుగు' అంటూ పార్వతమ్మ పెరట్లోకి వెళ్లిపోయింది.

వరండాలో చాప వేసుకొని కూర్చొని ఆఫీసు కాగితాలు చూచు కుంటున్న చిదానందం పరుగెత్తుకుంటూ వచ్చిన చిట్టిబాబువైపు చూచి 'ఏరా చిట్టిబాబూ! ఏం కావాలి?' అన్నాడు.

'మరేమీ వద్దులే నాన్నా! అమ్మకు తెలియదట. ఆ లావాటి మీసా లాయన ఎవరు?'

'ఆయన పేరు మధుసూధనరావుగారు. ఐనా పేరు చెప్పినంత మాత్రాన నీకేం తెలుస్తుందిరా చిట్టిబాబూ! జిల్లా అధికారి కలెక్టరంటూ చదువుకున్నావుగదా! ఈయన అపనే చేసేవాడు. ఇప్పుడు పెద్దవాడై పోయాడుగదా! విశ్రాంతి తీసుకుంటున్నాడు. అందుకు ఒక యిల్లంటూ వుండాలిగా! అందుకే ఈ యిల్లు కొన్నాడు. ఇకపైన ఇక్కడే ఉండిపోతా డట. తోడుగా వంట చేసిపెట్టడానికి ఒక వంటవాడుంటాడు. సరేనా!'

చిట్టిబాబు ఆలోచిస్తూ కూర్చున్నాడు. రెండు నిముషాలలా ఆలోచించే సరికి వాడి బుర్రలో మళ్లీ ఒక సందేహం బయల్దేరింది.

'వంట చేసిపెట్టడానికి వాళ్లవాళ్లెవరూ లేరా నాన్నా?'

'భార్య లేదట్రా పాపం. చనిపోయిందట. కొడుకులూ కూతుళ్లూ ఉన్నారనుకో. కొడుకులెక్కడో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. కూతుళ్లు వాళ్ల వాళ్ల అత్తగారిళ్లలో ఉన్నారు. వాళ్లు తమ దగ్గరంటే తమ దగ్గర ఉండమని బలవంతం చేస్తున్నారట. ఒకరిదగ్గరుంటే వేరొకరికి కోపం రాదూ! అందుకనే ఆయన ఇక్కడుంటున్నాడు. సర్లే. బడికి టైం అవుతోంది. వెళ్లి పుస్తకాలు సర్దుకో.'

ఆనాటి సాయంకాలం చిట్టిబాబు బడినుంచి యింటికొచ్చేసరికి ఎదురింటి స్వరూపం మారిపోయింది. వెల్లవేసిన గోడలు తెల్లగా మెరు స్తున్నాయి. ఇంటి చుట్టూ ఇప్పుడు అడవిగూడా లేదు.

రోజులు గడిచేకొద్దీ ఆయింటి చుట్టూ తోట పెరగసాగింది. ఇల్లు శుభ్రంగా వుంటుంది. లోపలినుంచి రేడియోగూడా వినవస్తుంది. అక్కడ లేనిదొక్కటే—మనుషుల సందడి.



'పాపం! అంత పెద్ద యింటిలో ఆలావాటి మీసాలాయనికి యెలా ప్రొద్దుపోతుందో' అనుకునేవాడు చిట్టిబాబు.

అరవై పైసలు పెట్టి చిదానందం చిట్టిబాబుకొక రబ్బరు బంతిని కొని తెచ్చాడు. బంతి చాలా బాగుంది. పెద్దది కూడా. కర్రతో కొడితే చివాలున పైకెగిరిపోతుంది. ఉదయంనుంచీ అదే ధ్యాసతో బంతితో ఆడు కుంటున్నాడు చిట్టిబాబు. కన్నుమూసి తెరిచేంతలో ఒక ప్రమాదం జరిగి పోయింది. ఆ మాయదారి బంతి ఒకపెట్టున పైకెగిరి ఎదురింటి గుమ్మంలో దూరి గోడకు తగిలించి వున్న గాంధీతాత పటానికి తగిలి హాల్లో దొర్ల సాగింది.

భయంతో చిట్టిబాబు గుండె కొట్టుకోసాగింది. మరొక వస్తువేదయినా అయితే, పోతేపోయింది లెమ్మని యింటిలోకి తుర్రుమనేవాడే చిట్టిబాబు. కానీ రబ్బరు బంతిపై మోజు అలా చేయనివ్వలేదు. ఎలాగైనా రబ్బరు బంతిని తెచ్చుకోవాలి. హాల్లో ఎవరైనా ఉన్నారేమో! మెల్లగా తక్కుతూ తారుతూ బెదురుబెదురుగానే గుమ్మందాకా వెళ్లి లోపలికి తొంగి చూశాడు చిట్టిబాబు.

'వచ్చావా అబ్బాయ్! బంతి కోసమే గదూ?' గంభీరంగా కంఠం వినిపించింది. బొద్దుమీసాలాయన వాలుకుర్చీలో ప్రత్యక్షమయ్యాడు.

'అవున్సార్! అవునండీ....'

'ఇలా లోపలికి వచ్చి ఎదురుగా నిలబడు.'

సింహం దగ్గరికి వెళ్తున్న కుందేలు పిల్లలా చిట్టిబాబు నాలుగడుగులు లోపలికి వేశాడు.

'బంతితో ఆడుకోవచ్చు. కానీ దాన్ని ఇతరుల యిళ్లలో పడేటట్లు కొట్టటం తప్పుగదూ!'

'తప్పేనండీ ...'

'బంతి పటానికి తగిలింది. అందులోనూ బాపూ పటానికి. పడిన చోట మరక కూడా అయింది. క్రిందపడి పగిలిపోయివుంటె?....'

చిట్టిబాబు పటంవైపు చూశాడు. పటంలోని తాతయ్యకు కోపం వచ్చినట్టు లేదు. చిట్టిబాబు కళ్లు క్రిందికి దించాడు. బొద్దుమీసాలాయన తనవైపు సూటిగా చూస్తున్నాడు.

'నేను కావాలని కొట్టలేదండీ! ఎలా వచ్చిందో పటానికి తగిలింది. ఇంకెప్పుడూ బంతిని రోడ్డుపైకి తీసుకరానండి....'

'అబ్బే, కాదులే అబ్బాయ్! తప్పు తప్పే! తప్పు ఒప్పుకోవాలి. శిక్ష ననుభవించాలి. అదీ బుద్ధిమంతుల లక్షణం. ఒప్పుకుంటావా?'

'అలాగేనండి.'

'ఐతే వుండు. ఒక్క క్షణంలో వస్తాను. తప్పించుకోడానికి ప్రయత్నించావో శిక్ష రెట్టింపవుతుంది.'

మధుసూధనరావుగారు లేచి లోపలికి వెళ్లారు. చిట్టిబాబు కతడు నిల్చున్న నేల కంపించిపోతున్నట్టుగా వుంది. కళ్లల్లో నీళ్లు గ్రిరున

తిరిగాయి.

ఇంతలో మధుసూధనరావుగారు మళ్లీ హాల్లోకి వచ్చారు.

యదాస్థానంలో కూర్చుంటూ 'ఐదు నిముషాలాగాలి, తరువాత చెబుతాను. ముందుగా నేనడిగిన ప్రశ్నలకు జవాబులివ్వు. నీ పేరేమిటి?'

'మా అమ్మా నాన్నా చిట్టిబాబంటారండి. బడిలోనేమో నా పేరు హరిబాబు.'

'ఏ తరగతి?'

'నాలుగో తరగతి చదువుతున్నానండి'

'మీ నాన్న పేరేమిటి?'

'చిదానందంగారండి'

'ఆయనేం చేస్తాడు?'

'ఆఫీసులో పనండి'

'పెద్దవాడైతే నువ్వేం చేస్తావ్?'

చిట్టిబాబు ఏంచెప్పాలో తోచక గుటకలు మింగసాగాడు.

ద్వారం దగ్గర అడుగుల చప్పుడయింది. వంట మనిషి సుబ్బయ్య ఒక చేతిలో ప్లేటు, మరో చేతిలో నీళ్ల గ్లాసు తీసుకొచ్చి పెట్టాడు.

'ఇలా వచ్చి కూర్చో!' అన్నారు మధుసూధనరావుగారు.

చిట్టిబాబు తటపటాయించాడు.

'ఊ కూర్చో' స్వరం హెచ్చింది.

ఎగిరి కుర్చీలో కూర్చున్నాడు చిట్టిబాబు.

'ఆకు తీసేసెయ్!'

చిట్టిబాబు పాదాలకు నేల అందడం లేదు. చేతులకు టేబుల్ పైనున్న ప్లేటు అందలేదు. మధుసూధనరావుగారు చటుక్కున పైకిలేచి చిట్టిబాబును పైకెత్తి టేబుల్‌పైన కూర్చోబెట్టారు. చిట్టిబాబు ఆకు తీసేశాడు. ప్లేటులో గారెలు ప్రత్యక్షమయ్యాయి.

'ఊ త్వరగా ముగించు. అన్నీ తినేసెయ్యాలి! అదే నీకు శిక్ష. ఇకపైన బంతిని యిలా యితరుల యిళ్లల్లోకి కొట్టగూడదు. ఇంకొకటేమిటంటే నీవు ప్రతిరోజు ఇక్కడికి రావాలి. తెలిసిందా చిట్టిబాబూ!'

'తెలిసిందండీ'

'ఏమిటి తెలిసింది?'

'ప్రతిరోజూ యిక్కడికి రావాలి'

'ఎందుకు?'

'ఎందుకో మీరు చెప్పలేదండి'

'ఎందుకంటే మనిద్దరం ఇకమీదట స్నేహితులం. నేను నీతో కలిసి ఆడుకోలేననుకో. కానీ మంచి కథలు చెబుతాను. ఏమంటావ్....'

'అలాగేనండీ'

'అన్నీ తినేశావ్‌గదూ. మెల్లగా దిగు. బంతిని తీసుకున్నావ్‌గదా! ఇక వెళ్లు.'

తూనీగలా పరుగెత్తాడు చిట్టిబాబు.

∗ ∗ ∗

'ఒరే చిట్టిబాబూ! అరగంటసేపటి నుంచీ కనిపించలేదు. ఎక్కడి కెళ్లావురా?' అడిగింది పార్వతమ్మ.

'నీకు తెలియదులేవే అమ్మా! బొద్దుమీసాలాయన చాలా మంచి వాడు' అన్నాడు చిట్టిబాబు.

'ఎందుకెళ్లావురా ఎదురింటికి? ఆయన చెడ్డవాడట. చాలా స్ట్రిక్టు ఆఫీసరట. తహశిల్దార్లు, రెవిన్యూ యిన్స్పెక్టర్లు ఆయన్ను చూసి హడలి పోయేవారట. మీ నాన్నగారు చెప్పారు....'

'అన్నీ అబద్ధాలే'

'కుర్రకుంకవి నీకేం తెలుసు ఆయన మంచితనం?'

'ఆయన నాతో నేస్తం కడతానన్నాడు. కథలు చెబుతానన్నాడు. గారెలు తినమన్నాడు.'

'ఇంతకూ నువ్వే వెళ్లావా?'

'లేదమ్మా! నేను కొట్టిన బంతి ఎదురింట్లో గాంధీ పటానికి తగిలింది. నేనేమో తెచ్చుకొందామని అక్కడికి వెళ్లాను. అప్పుడు లావాటి మీసా లాయన అక్కడ ఉన్నాడు.'

'హవ్వ! ఇంకేమైనా వుందట్రా చిట్టిబాబూ! నీకు దేహశుద్ధి చేయా ల్సిందిపోయి గారెలు పెట్టాడా? నిజమేనట్రా...'విస్తుపోయింది పార్వతమ్మ.

చిట్టిబాబుకు గూడా లోలోపల చిత్రంగానే ఉంది.

◦ ◦ ◦

మరునాడు బడిదినం. సాయంకాలం చిట్టిబాబు బడినుంచి వచ్చే సరికి తనకోసం ఎదురింటి వంటాయన వచ్చి వెళ్లినట్టు తెలిసింది. 'ఒరే చిట్టిబాబూ! నీకు పిలుపొచ్చింది. బొద్దుమీసాలాయన రమ్మన్నాడట' అంది

పార్వతమ్మ.

చిట్టిబాబుకారోజు ఎదురింట్లో కమలాపళ్లు దొరికాయి. గ్లాసు నిండుకూ నిమ్మరసం దొరికింది. అయితే వీటికన్నా వాడికి మీసాలాయన చెప్పిన కథే బాగుంది.

ఎవడో 'సిందుబాద'నే నావికుడుండేవాడట! అతడు సముద్రంపైన ఎన్నెన్నో దేశాలకు వెళ్లాడట! ఒక దేశంలోనైతే గండభేరుండ పక్షి ఒకటి అతణ్ణి తన్నుకపోయిందట! అయినా ఎలాగో తప్పించుకున్నాడట! 'అమ్మో! ఎంత గుండెలు తీసిన బంటో' అనుకుంటూ ఆశ్చర్యపడిపోయాడు చిట్టిబాబు.



ఎదురింటాయన మీసాలేకావు; ఆయన చెప్పే కథలు కూడా చాలా పెద్దవి. అయితే ఒకటి. ప్రొద్దుపోయి, దీపాలు వెలిగేసరికి ఆయన కథను ఆపేస్తాడు. 'వెళ్లి చదువుకో చిట్టీబాబూ! మిగిలిన కథ రేపు చెబుతాలే' అంటాడు.

అమ్మో, ముసలాయన చిట్టిబాబు కెన్నెన్ని కథలు చెప్పాడని! గలివర్ బ్రాబ్డింగు నాగుదేశం వెళ్లిన కథ చెప్పాడు. అలీబాబా నలభై దొంగల కథ చెప్పాడు. అన్నింటికన్నా కాబూలీవాలా కథంటే చిట్టిబాబుకు చాలా యిష్టం. వింటుంటే ఏడుపొస్తుంది. అయినా వినాలనే ఉంటుంది.

రోజులు దొర్లిపోతున్నాయి. చిట్టిబాబు ఎదురింటి మీసాలాయనతో నేస్తం కట్టి మూడు మాసాలైంది.



ఒకరోజున వున్నట్టుండి ఆయన అన్నాడు: 'చూడు చిట్టిబాబూ! పై వారంనుంచీ మనకు పండుగ! ఎందుకో తెలుసా? మనకింకా చాలామంది స్నేహితులొస్తారు.'

ఎవరు వాళ్లు? ఎందుకొస్తారు? ఎన్నాళ్లుంటారు? ఇలా చిట్టిబాబు కెన్నో ప్రశ్నలు అడగాలనే వుంది. కానీ అంతలోనే దీపం వెలిగింది.

మరునాటి నుంచి వేసవి సెలవులు ప్రారంభమయ్యాయి. చిట్టిబాబు వాళ్లమ్మమ్మగారి ఊరికి వెళ్లి వారం రోజులుండి వచ్చాడు. వచ్చి చూచే సరికేమయింది? ఎదురింట్లో ఒక పిల్లల పటాలమే దిగేసింది.

జ్యోతి, ప్రసాద్, కిరణ్, కుమారి, చందన, రమ, ఆనంద్, రవి, భాను....యిలా చాలా పేర్లు వినిపిస్తున్నాయి.

ఊరినుంచి తిరిగివచ్చిననాటి మధ్యాహ్నం మూడు గంటలప్పుడు చిట్టిబాబు తక్కుతూ తారుతూ వెళ్లి ఎదురింటి ప్రహరీ గేటు దగ్గర నిల్చున్నాడు. కాంపౌండ్‌లోపల గున్నమామిడి చెట్టు క్రింద పిల్లలందరూ ఆడుకుంటున్నారు. ఒకడు బూరా ఊదుతున్నాడు. ఇంకొకడు పిల్లిమొగ్గలు వేస్తున్నాడు. వేరొకడు కొమ్మకు కట్టిన త్రాటి ఉయ్యాలలో ఊగుతున్నాడు. అమ్మాయిలు కొంచెం దూరంలో బొమ్మరిళ్లు కట్టుకుంటున్నారు.

'ఎవడో తొంగిచూస్తున్నాడురోయ్!' అన్నాడు కిరణ్.

'ముక్కు చూచారా? చిలక ముక్కులా లేదూ?' అన్నాడు ఆనంద్.

'వాణ్ణి పట్టుకోవాలి. ముక్కు చితగ్గొట్టాలి. గోతంలో వేసి కట్టె య్యాలి' అంటూ ప్రారంభించాడు ప్రసాద్.

'పాపం, ఏడవడూ?' అంది చందన.

'ఇష్ ఊరుకో! ఇలాంటి వాళ్లను లోపలికి రానీయగూడదు....ఒరేయ్ ఆనంద్, కిరణ్ అందరూ రండిరా....' పిల్లలందరూ కళ్లు పెద్దవి చేసి, పిడికిళ్లు బిగించి, ఔడు కరచుకుంటూ ముందుకు వురికారు.

చిట్టిబాబుకు మతి పోయినంత పనైంది. పరుగోపరుగు. పడుతూ లేస్తూ వెళ్లి వాళ్ల యింట్లో పడ్డాడు.

'ఏమిట్రా చిట్టిబాబూ! ఏమయింది?' అని ప్రశ్నించింది పార్వతమ్మ.

'ఎదురింటి కుర్రాళ్లే అమ్మా! ఊరికేనే నాపైకొస్తున్నారు'

'అవునుమరి! వాళ్లందరూ ముసలాయన మనుమలు, మనుమరాళ్లు. పెద్ద పెద్ద పట్నాలనుంచి వచ్చారు. కాన్వెంటులో చదువుతారట! కార్లలోనే తిరుగుతారట! వాళ్లు నిన్ను తమతో చేరనిస్తారా? వద్దులే బాబూ, నువ్వావైపు వెళ్లనేవద్దు' అంది పార్వతమ్మ.

సరిగ్గా ఆ సమయానికి ఎదురింటి పిల్లలు గున్నమామిడి చెట్టుక్రింద విజయోత్సవం జరుపుకుంటున్నారు. ఎవడో శత్రురాజుల గూఢచారి తమ రాజ్యంలోకి జొరబడాలని చూచాడు. తుపాకి పేల్చేసరికి తిరిగి చూడకుండా పారిపోయాడు. ఇకపైన ఎప్పుడయినా తల చూపిస్తే అప్పుడు చెప్పాలి వాడి పని!

* * *

నాలుగు రోజులు దొర్లిపోయాయి. ఎదురింటి పిల్లలు ఈ నాలుగు రోజుల్లోనూ శత్రురాజుల గూఢచారిని తమ రాజ్యం దరిదాపుల్లోకి రాకుండా

చేయగలిగారు. తప్పిదారి చిట్టిబాబు ఎప్పుడైనా వీధిలో కనిపిస్తె అరచి, గీపెట్టి, ముక్కు కోసేస్తానని భయపెట్టి, బెదిరించి నానా అల్లరీ చేశారు. తలుపులు బిడాయించుకుని యింట్లో వుండడమే చిట్టిబాబుకు క్షేమమై పోయింది.

ఒకనాటి మధ్యాహ్నం మధుసూధనరావుగారు హాల్లో ఫాను క్రింద కూర్చుని భోజనం చేస్తుండగా పెద్ద గగ్గోలు ఏదో వినిపించింది. ఆయన కిటికీలోనుంచి వెలుపలికి తొంగి చూశాడు. పిల్లలందరూ మామిడి చెట్టు దగ్గర ప్రోగయ్యారు. మగ పిల్లలు మాత్రం చెట్టెక్కి కొమ్మకొకడు చొప్పున కూచున్నారు. ఊరికే కూచున్నారా? అప్పటికప్పుడే పాటలు కట్టి బిగ్గరగా పాడేస్తున్నారు. 'చిట్టీ చిట్టీ శ్రీరంగం, చిట్టీ పెళ్లాం తారంగం' అని ఒకరు, 'చిట్టిబాబు చిట్టిబాబు జానెడంత, చిట్టిబాబు ముక్కేమో బారెడంత' అని

ఒకరు, 'చిట్టీ, పట్టీ, సున్నపు బటీ' అని ఒకరు....

చెట్టు క్రింద నిల్చున్న అమ్మాయిలు మగపిల్లల పాటలకు వంత పాడుతున్నారు.

ఎదురింటి గుమ్మం వెనుక నిల్చున్న చిట్టిబాబు దీనంగా వీళ్లవైపు బిక్కచూపులు చూస్తున్నాడు.

'ఒరేయ్ అబ్బాయిలూ!' ఉరుము ఉరిమినట్టుగా పిలుపు వినిపించింది.

'అందరూ యిలా వచ్చి నిల్చోండి'

చేతిని పైకెత్తి దోసిలిలో వున్న పట్టెడన్నాన్ని దూరంగా తోటలో పడేటట్టుగా విసిరారు రావుగారు. అన్నపు ముద్ద క్రింద పడగానే ప్రిదిలి మెతుకులన్నీ చెల్లాచెదురైపోయాయి.

'ఏంచేశానో చూచారుగదా! ఇప్పుడేం జరిగేది మీరు చెప్పాలి. ఊ, చెప్పవోయ్ ప్రసాద్....'

'ఓ కాకి వచ్చి వాలింది తాతయ్యా!'

'వ్రాలి ఏంచేసింది? అన్నం ముట్టుకుందా లేదా? నువ్వు చెప్పరా ఆనంద్'

'ముట్టుకోలేదు తాతయ్యా! కావు కావుమంటూ అరుస్తోంది.'

'అదిగో యింకో కాకి గూడా వచ్చేసింది' అన్నాడు కిరణ్.

'అదయినా అన్నం ముట్టుకోలేదు తాతయ్యా! కావు కావుమనే అరుస్తోంది' అంది జ్యోతి.

'అబ్బో, అబ్బో, ఎక్కడున్నాయో ఏమిటో! బోలెడన్ని కాకులొచ్చేశాయ్ తాతయ్యా!' అన్నాడు రవి.

'అన్నీ కలిసి యిప్పుడేం చేస్తున్నాయ్?' రావుగారు ప్రశ్నించారు.

'ఇప్పుడన్నీ ఒక్కొక్క మెతుకే ఏరుకుని తింటున్నాయి తాతయ్యా!' అంది చందన.

'మంచిది. కాకులకున్నంత మాత్రం బుద్ధి అయినా మనుషులకు లేకపోతే ఎలాగమ్మా? చిట్టిబాబును హడలగొట్టొచ్చా? వాడైనా మీలాంటి వాడే గదా! వాణ్ణి ఏడిపించడం తప్పు కాదూ?'

పిల్లలు ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. అందరూ ఒకే గొంతుకతో 'తప్పే తాతయ్యా' అన్నారు.

'ఈ తప్పుకు శిక్షమిటో తెలుసా?'

'కుంజిళ్లు పెడతాం తాతయ్యా!' అన్నాడు ప్రసాద్.

'ఇంటి చుట్టూ పది రౌండ్లు పరుగెత్తుకొస్తాం' అన్నాడు ఆనంద్.

'అదేం వద్దు. మీరు చిట్టిబాబుతో స్నేహంగా వుండాలి. మీరీవూరు నుంచి వెళ్లేటంతవరకూ వాణ్ణి గూడా మీతోబాటు మన యింటిలోనే వుండ నివ్వాలి.

* * *

మరునాటి ఉదయం రావుగారికి గున్నమామిడి నీడలో ఆడుకుంటున్న పిల్లల్లో చిట్టిబాబు కూడా కనిపించాడు. ఆయన కళ్లు ఆనందంతో మెరిసాయి.

# దయను మించిన మందు లేదు

—వాకాటి పాండురంగారావ్

రాముకు ఎనిమిదేళ్లు. మూడవ తరగతి చదువుతున్నాడు. కాని వాడికి బడి అన్నా, పాఠాలన్నా ఎక్కువ యిష్టం లేదు. కాలువ గట్టున నిలబడి నీటిలో తిరుగాడే చేపలు చూడ్డం వాడికిష్టం. చెట్టు క్రింద పడుకుని ఆకాశంలో ఎగిరే పక్షుల్ని లెక్కపెట్టడం వాడికిష్టం. ఐనాసరే, వాళ్ల నాన్న శివరాం బలవంతం మీద ఏదో చదివేవాడు. ఇంకొంచెం పెద్దవాడయితే వాడు బాగా చదువుతాడులే అనుకునేవాడు వాళ్ల నాన్న.

ఆరోజు శనివారం. బడి లేదు. సాయంకాలం రాముకు రెండు లెక్కలిచ్చి చేయమన్నాడు శివరాం. ఆయనేమో దిన పత్రిక చదువుతూ కూర్చున్నాడు. ఒక లెక్క చేశాడు రాము. రెండవది చేయబోతుండగా ఎదుట వున్న పిట్టగోడ మీదకొక పిల్లిపిల్ల రావడం కంటపడింది. 'మ్యావ్ మ్యావ్' అని అది అంటుంటే 'రా! రా! నాతో ఆడుకోవడానికి రా!' అన్నట్లు అనిపించింది రామానికి. తెల్లటి ఒళ్లు మీద గోధుమ రంగు చారలతో ఆ పిల్లిపిల్ల రంగు కాగితంచుట్టిన ఐస్‌క్రీములా ఎంచక్కా వుందో!

ఆ పిట్టగోడ మీద నుండి నేల సుమారు పది అడుగుల క్రిందకుంది. క్రిందకు గెంతబోయి ఆపిల్లిపిల్ల రాముకేసి చూసింది.

ఎలాగైతేనేమి గెంతింది పిల్లిపిల్ల.

కాని పాపం, అలా గెంతడంలో దాని ముందుకాలొకటి మడత పడింది. మరి విరిగింది కూడా నేమో! ఉండచుట్టుకు దొర్లింది. కుయ్యోమంది.

రాము చేతిలో పుస్తకం క్రింద పడింది.

'ఏమిట్రా చూస్తున్నావు?' అన్నాడు దినపత్రికలోకే చూస్తూ వాడి నాన్న.

'అబ్బే ఏమీలేదు....ఒకటికి వెళ్లొస్తా'నంటూ నసిగాడు రాము. పిట్ట గోడవైపు చూచాడు.

పిల్లిపిల్ల అక్కడ లేదు.

లేచి పరుగెత్తి వెళ్లాడు.

పిల్లిపిల్ల కనబడలేదు.

వీధిలోకి పరుగెత్తాడు. ఇంట్లోకి వెళ్లాడు. మళ్లీ వీధిలోకి పరుగెత్తాడు. 'ఏవిట్రా, అట్లా కాలుకాలిన పిల్లిలా తిరుగుతావేం' అని అడిగింది వాళ్లమ్మ.



ఈలోగా బాత్‌రూం వైపునుండి ఎవరో పిలిచినట్లయితే పరుగెత్తుకు వెళ్లాడు రాము.

పిట్టగోడకొక మూలగా వుంది బాత్‌రూం. దాని కాలువలో పడివుంది పిల్లిపిల్ల. బురదల చారలతో, తడిసిన ఒళ్లుతో దారపు వుండలా పడివుంది. దానిని జాగ్రత్తగా బయటికి తీశాడు. అది 'మ్యావ్' అనబోయింది. కాని అనలేకపోయింది. నెమ్మదిగా దానిని చేతుల్లోకి తీసుకున్నాడు రాము.

'పడిపోయావామ్మా....నొప్పిగా వుందా?' అని దానిని బుజ్జగిస్తూ ఎత్తుకువెళ్లి అరుగుకింద దాచాడు రాము. తన తువ్వాలుతో దాని ఒంటి మీద బురదను, తడిని తుడవసాగాడు. ముందుకాలి దగర తుడవబోతే 'గుర్ర్'మంది అది. వీపు దువ్వాడు రాము. దానిని రెండు చేతులతో ఎత్తుకుని బుగ్గలకు హత్తుకున్నాడు. అది కళ్లు మూసుకుంది. ఆపిల్లిపిల్ల తెరవలేక కళ్లు తెరిచినా, అరవలేక అరిచినా ఏమిటోగా వుంది రాముకి. అమ్మతోగాని, నాన్నతోగాని, ఎవరైనా డాక్టరుతోగాని, లేకపోతే....వంటింట్లో గోడమీద ఫోటోలో—బోలెడు నగలతో, నాలుగు చేతులతో వుంటాడే దేవుడు....ఆదేవుడితో చెబుదాం....అనిపించింది. కాని....

ఇంతలో పిల్లిపిల్ల అరిచింది.

పాతసంచినొకదానిని మెత్తగా మడతవేసి, దానిమీద పిల్లిపిల్లను పడుకోబెట్టాడు రాము. కొబ్బరి చిప్పలో పాలు పోసి దాని నోటిదగ్గరగా పెట్టాడు. చాల నెమ్మదిగా ఆ పాలను తాగింది పిల్లిపిల్ల. పాలబొట్లు అంటుకున్న దాని మీసాలు చూస్తే నవ్వొచ్చింది రాముకు. కళ్లు తెరిచి వాడిని చూచింది అది. వాడు నవ్వాడు. బొమ్మల పుస్తకంలో కృష్ణదేవ రాయలకు మల్లే ఎంతందమైన మీసాలో అనుకున్నాడు రాము.

ఇంతలో శివరాం గర్జించాడు. రాము వెళ్లి అతి కష్టం మీద అరెండో లెక్కను చేశాడు. వాళ్ల నాన్న ఏదో పాఠం చెబుతే విన్నాడు. ఈలోగా ప్రపంచంలో నిర్దయలాగున—అలుముకుంది చీకటి. వాళ్లమ్మ లాంతర్లు వెలిగించకముందే రాము అరుగు దగ్గరకు వెళ్లాడు.

'పుస్....పుస్' అని పిల్లిపిల్లను పిలిచాడు.

జవాబేమీ రాలేదు.

'అయ్యో! ఏమైపోయింది పిల్లిపిల్ల—' అన్న భయంతో అరుగు ందకు చీకట్లోకి చేయి పెట్టాడు. సంచి మెత్తగా తగిలింది చేతికి. వెంటనే చేతిని రక్కున కుట్టిందొక పెద్ద తేలు.

కెవ్వుమని కేక పెట్టాడు రాము.



అప్పటికే తేలు విషం బాగా ఒంట్లోకి వ్యాపించింది గనుక. పది రూపాయల ఖరీదు చేసే ఇంజక్షనొక్కటివ్వాలన్నారు డాక్టరుగారు.

'ఇవ్వండి డాక్టరుగారూ!' అన్నాడు శివరాం.

'మరి డబ్బో?' అని అడిగారు డాక్టరు.

'అబ్బాయిని తెస్తున్న తొందరలో మరిచిపోయాను. ఇంజక్షనివ్వండి డబ్బు తెచ్చిస్తాను' అన్నాడు శివరాం.

'అబ్బే....అలా కుదరదండీ....ముందు డబ్బివ్వాలి' అని లోపలికి వెళ్లిపోయాడు డాక్టరు.

శివరాం పరుగెత్తుకుని యింటికి వెళ్లి పది రూపాయలు తెచ్చి డాక్టరు కిచ్చాడు.

ఇంజక్షన్ యిచ్చిన ఇరవై నిముషాలకు కళ్లు తెరిచాడు రాము.

'పిల్లిపిల్ల ఎట్లావుంది నాన్నా?' అని అడిగాడు.

'బాగుందిరా అబ్బాయ్'

'పిల్లిపిల్లా! ఏమిటదీ?' అని కుతూహలంతో అడిగారు డాక్టరు దయానందరావు.

పిల్లిపిల్ల సంగతిని వివరంగా చెప్పాడు శివరాం.

మరుక్షణం—'యిదుగోనోయ్ రామూ.... నువ్వు చేసిన మంచి పనికి బహుమతి!' అంటూ వాడి చొక్కా జేబులో పదిరూపాయలుంచారు డాక్టరు.

ఆశ్చర్యంతో చూశాడు శివరాం.

తల వంచుకున్నాడు డాక్టరు.

# బొమ్మల పెళ్లి

—తురగా జానకీరాణి

"పెళ్లికూతుర్ని తీసుకొనిరావడానికి గంప ఏది?"

"ఇదిగో యిది బావుందా?" అని చిన్న ప్లాస్టిక్ బుట్ట చూపించింది. ఒక ముత్తయిదువ.

"బాగానే వుంది. కానీ. ఈపెళ్లికూతురు కాళ్లు మడత పెట్టడం కష్టం. నుంచో పెట్టాలి. అయ్యో. ఈ పూలజడకి మెడ వంకర పోతోంది. తల వూడిపోతుందేమో" అని ఆ బిడ్డతల్లి బాధపడిపోతోంది. అవతల వంటలు ఐపోతున్నాయి. పిల్లలంతా ఘొల్లున మేళాలు వాయించేస్తున్నారు.

"జీలకర్ర, బెల్లం ఏదీ? ఇదేమిటి, దీన్నిండా చీమలు. తెరబట్ట యిదిగో. ఏయ్ పురోహితుడూ, అమ్మనడిగి పంచె గట్టిగా కట్టించుకొనిరా. ఊడిపోతుంది" అని కేకవేశాడు వియ్యంకుడు.

"కృష్ణమ్మా. సారె సామాన్లలో కంచాలు తుడిచిపెట్టావా? మండ పానికి ఈపక్కన ముగ్గు తమ్ముడు తొక్కేశాడు. మళ్లీ వేయి. మెల్లిగా నడు. ఏమిటా తొందర? మందిరం కదులుతోంది" అని ఉష అధికారం చూపించింది పనిపిల్లమీద.

"సిన్నమ్మా! నువ్వాకో. వర్లకు. నేను ముగ్గులు గిట్ట ముద్దుగ బెడతా" అది చెమటలు తుడుచుకుంటూ హడావిడిపడుతోంది.

ఈలోగా పెళ్లికూతురు అమ్మమ్మ. అంటే సత్యప్రభ తల్లి లక్ష్మి వచ్చింది. సావిట్లో జరుగుతున్న గందరగోళం చూడటానికి.

"అమ్మా, అమ్మా! బావుందా ఈ మందిరం? యిదిగో, యిదేమో మంగళసూత్రం. ఇవి నల్లపూసలు. అమ్మా, పెళ్లికూతురికి సారె చూడవే ఎన్నిస్తున్నామో. యీ చిన్న బుట్టలోవన్నీ బంగారు కాసులు.... పెళ్లికొడుక్కి కట్నం" అన్నది సత్యప్రభ.



"ఛీ! కట్నం తీసుకోకూడదు. పోలీసులు పట్టుకుంటారు. ఏయ్ చిట్టిబాబూ! నువ్వు మగవాళ్లందరికీ అక్షింతలిచ్చావా? కూర్చో అత్తయ్యా! పెళ్లి చూశాకా, భోజనం పెడతాం. బెల్లంతో చారు పెట్టింది కృష్ణమ్మ. ఎంత బావుందో! చూడు, ఒక్క చెంచా నోట్లో వేసుకో" ఉష లక్ష్మి చేయి పట్టుకొని గుంజింది.

"అబ్బ ఉండవే! కృష్ణమ్మ చారు పెట్టడం, నేను తాగడం చాలా బాగుందిగానీ, దాన్ని పంపేయండింక. వూరికెళ్లాలిట. రాములమ్మ మరీ మరీ చెప్పింది. పది కాకుండా పంపించమని. ఏమే కిష్టమ్మా! మీ అమ్మ తొందరగా రమ్మందిగా, వెళ్లింక. బస్సు టైమైపోతోంది" అని కోప్పడి లక్ష్మి వెళ్లింది లోపలికి.

రాములమ్మ రానే వచ్చింది "ఏందే, గీడనే కూసున్నవ్! పద మీ అయ్య పరేశానయితుండు" అని కూతురుని జబ్బ పట్టుకొని లేవదీసింది.

"ఏమిటి రాములమ్మా! బొమ్మలకి పెళ్లి చేస్తోంటే రమ్మంటావేమిటి? బోలెడు పనుంది. కృష్ణమ్మ రాదు. మీరంత పొండి వూరికి. మాయింట్లోనే రాత్రికి పడుకుంటుందిలే" అన్నది ఉష పెద్దగా అరుస్తూ. పిల్లలంతా జేరి కృష్ణమ్మ వుండాలి, వూరికెళ్లద్దు అని గోలగోల చేశారు.

"ఎట్లనమ్మ ఉసమ్మా! నువ్వీడ బొమ్మలకి పెళ్లి సేస్తవుంటె, ఆడ కిట్టమ్మ లగ్గం ఎట్ల కావాల?"

"ఏమిటీ, కిష్టమ్మకి పెళ్లా?" పిల్లలంతా ఒక్కసారి నోరు తెరిచేశారు. కృష్ణమ్మ తల వంచుకుంది. వేసే ముగ్గు ఆపేసింది.

"ఔ, కిట్టమ్మకి లగ్గం సేయాలనే వూరికి బోతుండ. ఇగ ఆడనే ఉంటది. మీరంతా లగ్గానికి రావాల. కారటు పంపిస్తా. నీ కాల్మొక్త దొరసానీ" అన్నది రాములమ్మ ఒక దణ్ణం పెడుతూ.

"లెయ్యవే. యింకా యాడనే సత్తావా" అని ఒక్క కేక పెట్టింది.

పిల్లలు లక్ష్మికి దగ్గరగా వెళ్లి నిలబడ్డారు. తమతో కలిసి ఆడు కుంటున్న కృష్ణమ్మకి పెళ్లి చేయడం ఏమిటో అర్థం కావడం లేదు.

"ఏమిటమ్మా? కృష్ణమ్మ యింకా చిన్నపిల్లేకదా! అప్పుడే పెళ్లేమిటి?" అన్నది సత్యప్రభ.

"వీళ్లల్లో అంతేనే. పదేళ్లు రాకుండానే పెళ్ళి. యింకా ఆలస్యం చేసేసిందని వాళ్లవాళ్లంతా కేకలేస్తున్నారట. అందాకా ఎందుకు? మీ అమ్మకి పదకొండో ఏట పెళ్లయింది. మా అమ్మమ్మకేమో నాలుగో ఏట పెళ్లయ్యింది. అంటే సరిగ్గా ఉష అంత ఉండేటప్పటికి అత్తారింటికి వెళ్లిపోయింది కూడా" అన్నది లక్ష్మి పాతనాటి విషయాల్ని గుర్తు తెచ్చుకుంటూ.

"పెళ్లి సేయమంటె ఏంసేయాల దొరసానీ! గీపిల్లలకు బువ్వెట్ల దొరుకుది? పెళ్లి పిలగాడు గింతున్నడు. అత్త అరతులం బంగారమెడద్ది.

గరీంబోళ్లం. కాల్మొక్త" అన్నది రాములమ్మ మళ్లీ దణ్ణం పెడుతూ. కిష్టమ్మ తన స్నేహితులందరివంకా చూసి అందరి దగ్గరా కళ్ళతోటే సెలవు పుచ్చుకొని కదిలింది తల్లివెంట.

బొమ్మల పెళ్లి వుషారంతా ఆగిపోయింది. బయటి గుమ్మంలో నిలబడి రాములమ్మ, కృష్ణమ్మ—వాళ్లిద్దరూ వెళ్లినవేపే చూశారు పిల్లలు. సత్యప్రభకి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. తమ్ముడు యిది చూశాడు. "అమ్మా అమ్మా! అక్క ఏడుస్తోందే" అన్నాడు.

లక్ష్మి దగ్గరగా వచ్చి చూసింది. "ఛీ! ఏడుపెందుకు? అది లక్షణంగా పెళ్లి చేసుకుంటుంది. రెండేళ్ళలో ఒక కొడుకునెత్తుకుంటుంది. పదపద. పెళ్ళి పనులన్నీ అల్లా ఉంచేసి కృష్ణమ్మ వెళ్ళిందని యిక్కడ ఏడుస్తూ కూచుంటావా?" అన్నది.

పిల్లలంతా మళ్లీ బొమ్మల పెళ్ళి మందిరం దగ్గరకి వచ్చారు. "అమ్మా, వాళ్లు పెళ్ళికి లడ్డూలు చేస్తారా?" అనడిగాడు తమ్ముడు.

"వాళ్లు బీదవాళ్లు, లడ్డూలు చేస్తారా? చేయరు కదా అత్తా?" అంది ఉష.

"ఎందుకు చేయరు? ఎట్లాంటివాళ్లూ పెళ్ళికి మిఠాయి చేసుకుంటారు. పాపం. రాములమ్మకి ఏదైన యిచ్చి పంపాల్సింది. పోనీ నేనొక పాత చీర యిస్తాను. ఓ పది రూపాయలు కూడా యిస్తా. అది వంద రూపాయలు అప్పు అడిగింది. చూసి పంపాలి. మీరిద్దరూ వెళ్లి చీర, డబ్బు యిస్తారా?" అన్నది లక్ష్మి.

నేనంటేనేనని, అందరూ పంతాలుపడి కొట్టుకొని చివరికి సత్యప్రభ ఉష కలిసి బయలుదేరారు. ఒక పాత సిల్కు చీర, పదిరూపాయలనోటు ఒక కవర్లో పెట్టి గట్టిగా దారంతో కట్టి యిచ్చింది లక్ష్మి.

దగ్గరే రాములమ్మ యిల్లు. పిల్లలిద్దరూ పరుగెత్తుకొని వేళ్లారేమో ఆయాసపడుతూ 'రాములమ్మా!' అని పిలిచారు. ఇంటిముందు వేపచెట్టు కింద ఆడుకుంటున్న పిల్లలు ఉష, సత్యప్రభ దగ్గరగా వచ్చి నిలబడ్డారు.

"కిట్టమ్మ లగ్గం అయితారం తెల్లారి. రాములమ్మగిట్ట పోతున్ను"అని చెప్పారు. రాములమ్మ వచ్చింది. పక్కనే కృష్ణమ్మ. అప్పుడే ప్రయాణం వేషం కట్టింది. ముదురు గులాబీరంగు పరికిణీ....ఆపైన పసుపు ఓణీ. ముఖం నిండా పౌడరు. జడలో ఆకుపచ్చ రంగు పెద్ద క్లిప్పు.

"మా అమ్మ నీకు చీర, కిష్టమ్మకు ఈ పదిరూపాయల నోటు ఇమ్మంది. మరి రాములమ్మా! మేము కృష్ణమ్మకి చదువు చెపుతున్నాం కదా, ఆ పుస్తకాలన్నీ ఏంచేస్తుంది? పట్టుకెడుతున్నారా మీరు?" అన్నది ఉష.

రాములమ్మ నవ్వింది. "గింకేటి సదువమ్మా! అత్తోరింటికాడ జరంతైన పురసత్ వుంటుందా? బాయికాడికి పోవాల, సేనులో పనుంటాది. గొడ్లకాడి పని, సిన్నపని కాదు గాడ. గింక సదువులూ, ఆటలూ అన్నీ బంద్. మీ అసుంటోళ్లకి సదువులూ, పాటలూ డాన్సులూ మా అసుంటో ళ్లకు లగ్గమైందాకనే ఏటన్నా ఆటలు" అన్నది రాములమ్మ. కృష్ణమ్మ తలవంచుకునే వుంది. అంతవరకూ ఎగిరి గంతులేసిన పిల్ల ఆరిందాలా సిగ్గుపడుతూ నుంచుంది.

ఉషకి జాలేసింది. చదువుకోదు, ఆడుకోదు. "పోనీ రాములమ్మా! ఇప్పుడు పెళ్లి చేయకపోతే ఏమైంది? మా యింట్లో [illegible] చదువుకోనీ.

మా చిన్నత్తని చూడు. బి.ఎ. చదువుతోంది. యింకా పెళ్లి కాలేదు. అంతైనాక కిష్టమ్మకి పెళ్లిచేద్దాం" అన్నది ఉష సీరియస్‌గ.

రాములమ్మ ఉష గడ్డం పుణికింది. "సల్లని తల్లి! ఎంత ముద్దుగ సెప్తుతుందిలే ముచ్చట్లు. ఈలగ్గం [illegible]కుంటే అళ్ల తాత, అవ్వ, సిత్తప్ప, సిన్నమ్మ అంతా నన్ను సంపేత్తరు. ఈడు వచ్చినాక మాలావు ఏసమంత చేపిస్తున్నావని తిడతవున్నారు. యింక నన్ను సంపేత్తరు ఎల్లకుంటె. ఇక పొండ్రి. పద్దినాలకొస్తానని సెప్పు అమ్మకి. నా కొలువు నాకే, లచుమక్క వపది ఈ పద్దినాలు చేప్పించుకోండ్రి" అని పిల్లలకి నచ్చచెప్పి, పంపింది. ఏమిటో ఆలోచించుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ యింటికి వచ్చారు.

చదువు లేదు కృష్ణమ్మకి, ఆటలు లేవు. బరువుగా ఒక ఓణీ.

ఇంటికి రాగానే “ఇచ్చారుటే? పదిరూపాయల నోటు. ఎక్కడా జారిపోలేదు కదా?” అన్నది వాళ్లమ్మ.



"ఇచ్చాంలేగానీ అత్తా, పాపం కృష్ణమ్మకి పెళ్లి చేయొద్దని చెప్పు అత్తా! మాతో ఆడుకోవడం, చదువుకోవడం యిష్టం దానికి" అని బతిమాలింది ఉష.



"ఓసి మీ యిల్లు బంగారంగానూ! మనిష్టం ఏమిటే. వాళ్ల పద్ధతి అది. ఏదో ఒకటి ఏడుస్తారు వాళ్లు. పదండి....యిక్కడ పెళ్లి ముహూర్తం మించిపోవడం లేదూ మీ బొమ్మలకి?" అన్నది లక్ష్మి.

"పోనీ, ఉషకి కూడా పెళ్లి చేద్దాం అమ్మా! మీ అమ్మమ్మ పద్ధతి అది, బావుంటుంది" అన్నది సత్యప్రభ. ఉష కొట్టడానికి చెయ్యెత్తింది.

"నీకు చేస్తారు పెళ్ళి ఫో" అన్నది. 'నీకు అంటే నీకు' అని వెక్కిరించుకుంటూ పరుగెత్తారిద్దరూ.

"ఉండండర్రా, పద్దెనిమిదేళ్లు నిండందే ఎవరికీ పెళ్ళి చేయకూడదు. మీరెవరైనా పెళ్ళిమాట ఎత్తారంటే తన్నేస్తా. బాగా చదువుకోవాలి. చదువు పూర్తయిన తరువాత డాక్టర్లో, ప్లీడర్లో, ఆఫీసర్లో అయింతర్వాత పెళ్ళి. తెలిసిందా?" అన్నది లక్ష్మి.

మిగతా పిల్లలు అప్పటికే పెళ్ళి తతగం ముగించేస్తున్నారు.

"రా సత్యా! తలంబ్రాలు మీరిద్దరే పోయాలి. పురోహితుడికి ఆకలిట. బిస్కట్టు పెడితే ఊరుకోవటంలేదు" అన్నాడు తమ్ముడు.

మందిరంలో బుద్ధిగా కూర్చున్నట్టున్న బొమ్మలవంక చూసింది సత్యప్రభ. నవ్వు ముఖాలు. చేతగాకుండా చేసిన అలంకారానికే మురిసి పోతున్నట్లున్నాయి వాటి ముఖాలు. ఆడబొమ్మను తీసి, మెల్లిగా పూలజడ విప్పేయడం మొదలుపెట్టింది. అది చూసిన ఉష—

"ఏమిటే! అంతా పీకేస్తున్నావు. యింకా తలంబ్రాలు కానిదే? అప్ప గింతలు కావాలి. అలకపాన్పు ఉందిట. ఇంకా చాలా పనుంది" అని అరిచింది.

"నేనేం ఈ ఆట ఆడను. స్కూలు ఆట అయితేనే ఆడతాను" అన్నది.

"స్కూలు ఆట, స్కూలు" అని అందరూ అరిచారు. పెళ్ళి సామా న్లన్నీ బుట్టలోకి ఎత్తేశారు. 'నేను టీచర్ అంటే నేను టీచర్' అని దెబ్బలాట.

ఆవేళ స్కూలు ఆటలో కృష్ణమ్మ లేకపోతే తోచలేదు సత్యప్రభకి.

# కొత్త యిల్లు కట్టుకుందాం

—దాస్‌బాబు

వాళ్లు ముగ్గురు స్టేషన్ వైపు మళ్లారు. మధ్యలో మూడు బొంగరాలు. మూడు గాలిపటాలు కొనుక్కుని స్టేషన్‌కి పరిగెత్తుకొచ్చారు. ఈలోగా రైలుబండి రావడమూ అయింది. వెళ్లిపోవడమూ అయింది. భయం భయంగా రాంబాబు కచ్చడం బండి దగ్గరికి వెళ్లేసరికి బండి ముందు నానమ్మ ప్రత్యక్షమయింది. వాళ్లనీ వాళ్ల చేతుల్లో వున్న పంతగుల్నీ మార్చి మార్చి చూసింది. రాంబాబుని దగ్గరకు తీసుకుని బండెక్కి కూర్చుంది. రాంబాబు కూడా బండెక్కి వాళ్లిద్దరికీ చోటు చూపించాడు. 'వీళ్లెవర్రా?' కళ్లెర్ర చేసింది నానమ్మ. 'వీడేమో యేసేపు. వీడేమో జానిమియా! మన ఫ్రెండ్స్ నానమ్మా!'

'నోర్ముయ్! ఫ్రెండులా చెండులా? యిలాంటి జులాయికోర్లతో జేరి వూరంతా తిరిగి నేను దిగిన గంటకా నువ్వొచ్చేది? వీళ్లు కూడా బండిలో ఎక్కాలా? పొమ్మను' అని కసిరికొట్టింది. ఆయిద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ నిలబడ్డారు. 'అదికాదు నానమ్మా! వీడేమో రత్తయ్య కొడుకు—మన తోటమాలి కొడుకు—వీడేమో మనతో కాయలు అమ్ముకొచ్చే గోరేమియా కొడుకు!'

'ఐతే ఏమిటి? మనతోబాటు బండెక్కాలని వుందా? వాళ్లెవరు, మనమెవరు? వీళ్లు బండెక్కితే మనం అంటుపడం? బుద్ధివుండే మాట్లాడుతున్నావా?' అని దీర్ఘం తీసింది. రాంబాబుకు తల కొట్టేసినంత పనయింది తన నేస్తాల ముందు.

'మరి ఈ బండి తోలేవాడు రత్తయ్య చుట్టం—వాడ్ని కూడా దిగి పొమ్మందామా' అని కోపంగా అడిగాడు.

'ఏమిట్రా కొక్కిరింపు. పక్కనే కూర్చుంటే అంటుపడ్తానన్నాను—దూరంగా కూర్చొని చావమను' అంటూ బండి చివరకు జరిగి మెట్టుమీద కాళ్లుపెట్టుకుని కూర్చుంది.

'ముందుకొచ్చి యిరుసు పక్కలో కూర్చోండిరా' అని రత్తయ్య పిలిచాడు. యోసేపు, జానిమియా ముందుకెళ్లి బండెక్కారు.

బండి యింటి ముందుకొచ్చి ఆగేసరికి సూర్యుడు నడినెత్తికెక్కాడు. రాంబాబు బండి దిగి 'నానమ్మ వచ్చిందోయ్' అని అరుచుకుంటూ లోపలికి గంతేశాడు. అమ్మా నాన్నా బయటికొచ్చారు. 'ఇంత లేటయిందేమ్మా బండి?' అని పలకరించాడు తల్లిని కొడుకు.

'ఏరా సూర్యం....నువ్వింట్లో వుండి కూడా జులాయికోరు వెధవల్ని పంపిస్తావా? ఏవే లక్ష్మి....మజ్జిగ ఏవన్నా వుంటే కాస్త ఉప్పు వేసివ్వవే, నాలుక పిడచగట్టుకు పోయింది' అని అక్కడున్న గాబు దగ్గర కాళ్లు చేతులు కడుక్కొని లోపలకు వెళ్లింది కామాక్షమ్మ.



రాత్రిపూట భోజనాలకని అంతా కూర్చున్నారు. కానీ రాంబాబు ఆ సమయానికి అక్కడ లేడు. కొంచెంసేపు చూసి పాలేరుని పొలంలోకి పంపించారు. అతను వెళ్లిన పది నిమిషాలకు రాంబాబు వచ్చాడు.

'ఈమధ్య తిరుగుళ్లు ఎక్కువయ్యాయి అత్తయ్యా! ఆ యోసేపు, జానిమియా యిద్దరూ తోడయ్యారు. వేళాపాళా లేకుండా యిష్టం వచ్చినట్లు తిరుగుతున్నారు. ఎంత మొత్తుకున్నా నా మాట వినేలా లేడు' అని రాంబాబు తల్లి ఫిర్యాదు చేసింది. దాంతో నానమ్మగారికి యెక్కడలేని కోపమూ వచ్చేసింది. 'నువ్వేం చేస్తున్నావురా సూర్యం? వీడిలా అడ్డమైన వాళ్లందరితోనూ తిరుగుతుంటేనూ' అని ఒక్క ఉరుము ఉరిమింది.

'అడ్డమైనవాళ్లు ఎవరమ్మా? వాళ్లిద్దరు మన పనివాళ్ల పిల్లలు. కొంత కాలం అంతా కలిసి చదువుకున్నారు....ఇప్పుడు కలిసి ఆడుకుంటున్నారు.

అతను ముగించకముందే 'రేపు కలిసి ఒకే కంచంలో తింటారు— సరేనా? ఏం మాట్లాడుతున్నావురా సూర్యం? అంటరానివాళ్లని రాసుకుంటూ పూసుకుంటూ తిరగడం మన యింటావంటా ఎక్కడైనా వుందా? యిదే చెపుతున్నా—రేపట్నుంచి రాంబాబు వాళ్ల దగ్గరకు వెళ్లడానికి వీల్లేదు. వాళ్లిటు రావడానికి వీల్లేదు. తెలిసిందా?'

ఈ మాటలు విని రాంబాబు బెదిరిపోయాడు.

'అట్లా అంటే కుదురుతుందా? యింట్లో పనెవరు చేస్తారు. తోట కాపలా ఎవరు కాస్తారు? తోటలో పండ్లు ఎవరమ్ముకొస్తారు?' అని సూర్యం గొణుక్కుంటూ అడిగాడు.

'మనం! నువ్వూ, నేను! ఏం మన పని మనం చేసుకోవడంలో తప్పేముంది? మామిడికాయలమ్ముకోవడం ఏం మహా విద్యనుకొన్నావా? రేపు కాయ బండికెక్కించి నువ్వు బండి తోలు, కాయల్ని నేనమ్మిపెడతా' నన్నది నానమ్మ.

తెల్లవారి మామిడికాయ బండి నానమ్మతో సహా, వీధిలోకి రాగానే శాస్త్రిగారు ఎదురయ్యారు.

'ఏమిటి చోద్యం? సూర్యం బండి తోలడం—కామాక్షమ్మ కాయల దగ్గర కూర్చోవడం! ఏమిటీ విశేషం. అరే, యివి బంగినపల్లి మామిడి కాయలు. నాకు నాలుగు చాలు, ప్రథమ ఫలం. మీ పేరు చెప్పుకుని తింటాం....' బండిలోనించి నాలుగు పళ్లు తీసికొని చకచకా నడిచి పోయాడు, డబ్బులివ్వకుండా.

ఇంకాస్త దూరం వెళ్లేసరికి దాసరి పెరుమాళ్లు ఎదురయ్యాడు.

'సూర్యానికి నమస్కారం! కామాక్షమ్మగారి నగుమోము కనిపించి ఎన్నాళ్లాయె!' అని రాగం తీసాడు. గబగబా పదికాయలు ధర్మం చేసింది. అది గమనించి దారినపోయే పోస్టుమాస్టరు బండి దగ్గరికి వచ్చాడు. అతనికి కూడా నాలుగు కాయలు యివ్వక తప్పిందికాదు. వాళ్లిద్దరూ వెళ్లిపోయాక....

'ఒరేయ్ సూర్యం....కరణం యింటికి పోనివ్వు. అనసూయకు సరిగా లేదుటగా—దాన్ని పలకరిస్తూ వుంటా, ఈలోగా కరణం సావిట్లో కాయలు పేర్చు-పదిమంది వచ్చే చోట, ఏదో వొక ధరకు అమ్మేసేయొచ్చు' అని అంది. అట్లాగే కరణంగారి యింటికి బండిని పోనిచ్చాడు.

'రా సూర్యం. కామాక్షమ్మా! ఈ స్టూలుపీట వేసుకుని మెల్లిగా దిగు. పెరుమాళ్లు చెప్పాడులే....ధర్మం చేసే చెయ్యి దాగదని—రంగయ్యా!

తలో నాలుగు తీసుకుని బండి ఖాళీ చెయ్యండి. ఎండలో ఎంతదాకా అని తిరుగుతారు పాపం' అని అంతా కలిసి బండిమీద ఎగబడ్డారు. కామాక్షమ్మ దిగేలోగా బండి ఖాళీ అయ్యింది. కామాక్షమ్మ, సూర్యం ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు తెల్లబోయి. కాసేపు అట్లాగే మాట్లాడకుండా నిలబడి మళ్లీ బండెక్కింది 'ఇంటికి పోనీ సూర్యం' అంది ఎంతో కష్టంగా.

'అనసూయని చూస్తానన్నావుగా!'

'అనసూయా లేదు, అనపకాయా లేదు, పోనివ్వు. దుర్మార్గులు. మంది సొమ్మంటే యింత మోజా' గొణుక్కుంటూ సర్దుకుంది.

గున్నమామిడి చెట్టుమీద కూర్చున్న రాంబాబుకు విసుగెత్తిపోతోంది. ఎందాకా అని చెట్టు మీద అలా కోతిలా కూర్చుంటాడు! ముంజెలు తీస్తామని యోసేపు, జానిమియా ఎంతకీ రాలేదు. తాటిగెలలు బందు కత్తి పట్టుకొని, అచెట్టు ఈచెట్టు దాటవేసుకుంటూ ఎవరికంటా పడకుండా చివరికి వాళ్ళిద్దరూ అక్కడకు చేరుకున్నారు.

'ఒరేయ్—ఇప్పుడు తోట మీద పెతనం అంతా మా నానమ్మదేరా! ఎవర్నీ లోపలికి రానివ్వడం లేదు' రాంబాబు చెప్పాడు.

'అదేమోగాని బాబూ! ఇప్పుడు మనల్ని చూసిందనుకో, నాసామి రంగా బరికేస్తది' అన్నాడు యోసేపు నవ్వుతూ.

'ఏం ఫరవాలేదు. అమ్మగారే కన్పిస్తే ఏట్లోకి దూకుదాం హంతే!' అన్నాడు జానిమియా. ఆ మాటలకి అందరూ నవ్వుకున్నారు. ఈసారి లేత కాయల్ని కొట్టి ముంజెల్ని వేళ్లతోనే జుర్రుకొన్నారు. యింతలో అటువేపు వస్తున్న నాయనమ్మ వాళ్ల కంటబడింది. 'ఒరేయ్! నాయనమ్మరోయ్' అని రాంబాబు అటు చూపించాడు.

'హాయ్ అల్లా' అని జానిమియా చెట్టు దిగబోతే యోసేపు అతన్ని పట్టుకుని 'ఎల్లినా అమ్మగారు సూస్తది. చిటారు కొమ్మల్లో దాక్కుందాం' అని యోసేపు అనడం, చిటారు కొమ్మల్లో ప్రాకడం క్షణంలో జరిగిపోయింది.

అటు యిటూ కాసేపు తిరిగి ఆ గున్నమామిడి చెట్టుదగ్గరికి వచ్చింది. ఆచెట్టు క్రింద ముంజెలు కొట్టేసిన తాటికాయలు కనిపించాయి. 'ఇదేమిటి మామిడిచెట్టు క్రింద తాటికాయలున్నాయి!' అనుకుంటూ దగ్గరకొచ్చింది. కాసేపు ఆలోచించి 'ఇది అ జులాయికోర్ల పనే అయుంటుంది. వాళ్లకాళ్లు విరగ్గొడితేకాని బుద్ధి రాదు. రాంబాబు దగ్గరికి రామాకంద్రా అంటే వినేట్టు లేరు. ఈసారి నాకంటబడాలి, నడుములు విరగ్గొడతా భడివల్ని....' అటు యిటు చూసుకుంటూ వెళ్లిపోయింది.

కాసేపాగి నెమ్మదిగా చెట్టు దిగారు ముగ్గురూ. 'ఒరేయ్! యింక లాభం లేదురా ! మా నాయనమ్మ యింక వూరుకోదు, అందుకే ఒకటి ఆలోచించా'—రాంబాబు అన్నాడు.

ఏమిటది' ఇద్దరూ ఆత్రంగా అడిగారు.

'మరి సీమచింతచెట్టున్న మూలలో పాడుబడిన బావుందా? ఆ బావి కవతల వేపు అంతా కంపే—ఎవ్వరూ రారు. అక్కడ చిన్న యిల్లు కట్టుకుందాం. అంటే తడికలు పెట్టి, తాటాకు కప్పి కొత్త యిల్లు కట్టుకుందాం. —రాంబాబు చెప్పాడు.

'ఔ భాయి. అపుడు ఫికరేం వుండద్!' జానిమియా అన్నాడు.

'బాగుంది. వాసాలు, బొంగులు, తాటాకులుంటే మేమిద్దరం యిల్లు వేస్తాం' యోసేపు ఆనందంగా అన్నాడు.

ముగ్గురూ కలిసి కొద్దిసేపు ఆలోచించారు. చిట్టచివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. ఏటివొడ్డునున్న తంగేడు చెట్లను కొట్టుకొచ్చి, తడికలల్లి పందిరి వేసి, ఇల్లులాగా కట్టాలని అనుకున్నారు. ఎవరి పోరూ లేకుండా అందులో స్వేచ్ఛగా వుండొచ్చని సంబరపడ్డారు.

వారం రోజుల్లో ఇల్లు పూర్తయింది. ఆయింట్లో ప్రవేశించిన రోజు వాళ్ల ఖులాసా అంతా యింతా అని చెప్పటానికి వీల్లేదు. రాంబాబు, జీడీలు, పూర్ణాలు తెచ్చాడు. యోసేపు సజ్జకుడుములు తెచ్చాడు. జానీమియా సేమ్యా తెచ్చాడు. అన్నీ దగ్గర చేర్చి, ముగ్గురూ కలిసి ఎవరికిష్టమయింది వాళ్లు తింటూ హాయిగా ఆపూట గడిపేసారు.

ఇట్లాగా రెండు మూడు రోజులు గడిచిపోయాయి. యింట్లోవాళ్లు రాంబాబు వాళ్లదగ్గరికి వెళ్లడం లేదని అనుకున్నారు. ఐతే కామాక్షమ్మకి మటుకు అనుమానంగానే వుంది. తోటలో ఆమె పెత్తనాలు ఎక్కువైనాయని అంతా బాధపడేవారు. తోట మధ్యలో వున్న బంగినిపల్లి మామిడి చెట్టుక్రింద ఒక కుక్కిమంచం వేయించుకొని అందులో కూర్చుని తోటని చూస్తూ వుండేది.

ఒకరోజు కామాక్షమ్మ తోటంతా చుట్టేసుకొస్తుంటే తంగేడు తడికలతో కట్టిన కొత్త యిల్లు ఆమె కంటబడింది. అది ఎవరు కట్టారో, ఎందుకు

కట్టారొ ఆమెకి అర్థం కాలేదు. వారం రోజుల క్రితం ఆ యింటిచి చూసిన గుర్తు లేదు. ఇంతలోనే ఎవరు కట్టారు? దగ్గరికి వెళ్లి చూదామంటే చుట్టూ ముళ్లకంచె....అపక్క ఈపక్క తచ్చట్లాడింది. కానీ అడుగు ముందు కెయ్యడానికి వీలు కాలేదు. కనీసం ఆ యింటి ముందు ఏమైనా కనిపిస్తుం దేమోనని నిక్కి చూసింది. ముంజెలు కొట్టేసిన తాటికాయలూ, మామిడి టెంకలూ కనిపించాయి. వెంటనే గున్నమామిడి చెట్టు క్రింద కనిపించిన తాటికాయలు గుర్తుకొచ్చాయి! అంటే—ఆ ముగ్గురూ చేరి యిలాటి యిల్లొకటి వేసుకొని ఇందులో కేరింతలూ, ఆటపాటలూ సాగిస్తున్నారన్న మాట. ఆహా! దాంతో కామాక్షమ్మకి చిర్రెత్తిపోయింది. 'అమ్మ భడవలూ! ఎంతకు తెగించారు. దగ్గరికి రామాకంద్రా అని నెత్తిన నోరు పెట్టుకుని మొత్తుకున్నా యిలా తయారవుతారా? వుండండి మీ పని చెప్తా' అనుకుంటూ ఒక రాయి తీసుకుని కొట్టి—'ఎవ్రా ఆ కొంపలో' అని అరిచింది. ఏ అలికిడీ లేదు. 'ఆహా, అయితే ఇంకా విడిదికి ఎవరూ రాలేదన్నమాట. అలాగయితే కొంపని కాల్చిపారేస్తే గొడవ తీరిపోతుంది' అనుకుంటూ అటు చూసేసరికి దగ్గర్లో మల్లిమొగ్గలు కోస్తున్న రంగయ్య కనిపిస్తున్నాడు. అతన్ని పిలిచింది. అతను దగ్గరికి వచ్చాక....

'రంగడూ! ఈ పాడుబడిన కొంపేవిట్రా యిలా పెంచారు? అగ్గిపుల్ల గీసి అంటించు.'ముందుగా తటపటాయించినా రంగయ్య ఆమె మాటలకు ఎదురు చెప్పలేకపోయాడు. అగ్గిపుల్ల గీసి కంపకు అంటించాడు. బాగా ఎండిపోయివుందా, క్షణంలో భగ్గుమంది. మరోక్షణంలో మంట పైకి లేచింది. 'పీడ విరగడైయ్యింది. లేకపోతే చాటుగా యిల్లేసుకుని మావాణ్ణి చెడగొడ్తారా వీళ్లు' గొణుక్కుంటూ వెనుదిరిగింది. ఇంతలో మంటల్లోనుంచి కేకలు వినిపించాయి. గిరుక్కున వెనక్కి తిరిగేసరికి మంటల్లో రాంబాబు నుంచొని బొబ్బలు పెడ్తున్నాడు. ఆ దృశ్యం చూసేసరికి కామాక్షమ్మకి గుండె అగినంత పనయ్యింది.

రాంబాబు మధ్యాహ్నం భోంచేసి కొత్త యింటికి వచ్చాడు. తన కోసం కాచుక్కూచున్న యోసేపు, జానిమియాలను ముంజెలు కొట్టుకు రమ్మని పంపించాడు. వాళ్లు రావడం ఆలస్యమయ్యేసరికి నిద్రపోయాడు. మంచి గాఢ నిద్రలో వున్నప్పుడు మంటల సెగ తగిలింది. లేచి చూచేసరికి మింగడానికి వస్తున్నాయా అన్నట్లు యింటిచుట్టూ మంటలు కనిపించాయి. ఎటూ తప్పించుకోడానికి వీలులేక కేకలు వేస్తూవున్నాడు.



కామాక్షమ్మ తేరుకుని—'రంగయ్యా! రాంబాబుని తీసుకుని రావా- నా మనవడో, అయ్యో రాంబాబు రంగయ్యా, రంగయ్యా' అని గుండెలు బాదుకుంటుంది. 'మంట పైకి లేచింది అమ్మగారూ! మంటలో అడుగు పెడితే మాడి బుగ్గయిపోవాల్సిందే—అయ్యగార్ని కేకేసుకొస్తా'—రంగయ్య వెళ్లబోయాడు. 'ముందు నా మనవడ్ని బైటికి తీరా—ఒరే రాంబాబురా- మా చిన్నబాబురా' ఏడుస్తోంది నానమ్మ.

ఇంతలో యోసేపు, జానిమియా—తాటి గెలలు తీసుకొని అటువేపు వస్తూ కామాక్షమ్మన్ని చూసి బెదిరిపోయారు.

'ఒరేయ్ రండ్రా నాయన్లారా రండి! మీ రాంబాబుని చూడండ్రా' అంటూ కేకలు వేసింది.

తాము కట్టుకున్న కొత్త యింటి చుట్టూ మంటలూ, యింట్లోనుంచి కేకలు వస్తున్న రాంబాబు కనిపించారు. 'నాయన్లారా! ఒరేయ్ రాంబాబుని

కాపాడండ్రా. చచ్చి మీ కడుపున పుడ్తా. ఒరేయ్'—ఏడుస్తూ ప్రాధేయ పడింది.

మారు మాట్లాడకుండా యోసేపు చివాల్న ఎగిరి నాలుగైదు మామిడి మండల్ని విరిచాడు. తనూ జానిమియా కలిసి ఆ పచ్చి కొమ్మల్ని మంట మీద వేసి వాటి మీద నడవబోయాడు. ఆ మంటల్ని చూసి మల్లెతోట లోంచి వచ్చిన శివుడు అనే పాలేరు వీళ్లిద్దర్నీ పట్టుకొని 'యోసేపు, సత్తా వురా! ఏంటీ యీ ఆగడం' అన్నాడు. 'వదులు, మా సావాసగాడు అట్టా మంటల్లో కాలిపోతావుంటే మేము చూస్తూ వూరుకుంటామనుకున్నావా? ఏమైనా సరే, సినబాబు దగ్గరికెళ్లాల్సిందే. సస్తే అంతా కలిసే సస్తాం' అంటూ పచ్చి మామిడి కొమ్మల మీద చరచరా నడిచి రాంబాబు దగ్గరి కెళ్లారు.

తోటంతా కనిపిస్తున్న ఆ మంటల్ని చూసి ఒక పక్కనుండి రత్తయ్య మరో పక్కనుండి గోరేమియా, సూర్యం, రంగయ్య అంతా పరుగెత్తు కొచ్చారు. అప్పటికే యోసేపు, జానిమియా, రాంబాబు దగ్గరికి వెళ్లి పోయారు. కేకలు వేసి, వేసి తట్టుకోలేక రాంబాబు సొమ్మసిల్లాడు. రాంబాబుని భుజాల మీద వేసుకొని నడుస్తుంటే, జానిమియా వాసాన్ని పెట్టి మంట కంపని కొడుతూ ముందు నడిచాడు.

రాంబాబుని కిందకి దించగానే వాడిని తన వళ్లో పడుకోబెట్టుకొని ముద్దు పెట్టుకుంది. కాస్సేపటికి తలెత్తి వాళ్లవంక చూసి....

'బాబూ! మీరూ నాదగ్గరగా రండిరా....మిరె దెముళ్లు. నా మనవణ్ణి రక్షించారు. ఇకనుంచి నాకు ముగ్గురు మనవలు' అని గట్టిగా ఏడిచింది. సూర్యం ఈలోగా రాంబాబు బట్టలు తీసేసి మందు పూస్తున్నాడు.

'ఒరేయ్ సూర్యం....తోట మధ్యలో కొత్తయిల్లు కట్టించు. మనమంతా రోజూ అక్కడే వుందాం' అన్నది.

'ఒరేయ్ యోసేపూ, జానిమియా....మనకోసం నానమ్మ కొత్త యిల్లు కడుతుందిట్రా'—రాంబాబు అన్నాడు నీరసంగా.

మళ్లీ వాళ్ల కళ్లల్లో కాంతి తళుక్కుమంది.

# మూడు పిల్లి కూనలు

ఇల్లిందల సరస్వతీదేవి

కోడూరివారి పెరటి గూనలో ఒక నల్ల చారల పిల్లి మూడు కూనలను పెట్టింది. అవి అప్పుడప్పుడే కళ్లు తెరుస్తున్నాయి. తల్లి వాటికి ముద్దుగా గంగ, రంగ, మంగ అని పేర్లు పెట్టింది. అవి తల్లిని చూడగానే మ్యావ్ మ్యావ్‌మంటూ చుట్టూ చేరుకుంటాయి. ఆతల్లి వాటికి ప్రేమతో పాలిచ్చి మురుస్తూ ఉంటుంది.

మధ్యాహ్నం పన్నెండు గంటల సమయం. కోడూరి వారి యింట్లో అందరూ భోజనాలకు కూర్చున్నారు. పెద్ద పిల్లి అప్పుడే పరుగెత్తుకుంటూ వచ్చింది. తన కూనలను అక్కడినుంచి తీసుకుపోవాలనుకున్నది. నాలుగు ఇళ్లవతల ఒక చుట్టిల్లు చూసుకు వచ్చింది.

ఆ యింట్లో ఒక అవుదూడను కట్టివేశారు. ఒక మూలగా చొప్ప కట్టలు పేర్చి వున్నాయి. వాటి సందులలో తన కూనలను ఉంచాలని తల్లి పిల్లి నిశ్చయించింది. ఒక్కొక్క కూననే నోట కరచుకొని తీసుకుపోయి చొప్పకట్టల చాటున ఉంచింది.

చుట్టింటిలోకి వచ్చిన తరువాత గంగ, మంగ, రంగ మ్యావ్ మ్యావ్ మంటూ బాగా అరవటం నేర్చుకున్నాయి. చెంగుచెంగున గంతులు వేయటం మొదలుపెట్టాయి. ఆ మూడు కూనలలోనూ గంగ చాలా చురుకైనది. దానిది గోధుమ వన్నె దేహం. ముఖమ్మీద తెల్లటి మచ్చ. చాలా ముద్దుగా వుంటుంది.

ఆ చుట్టింట్లో ఉన్న అవుదూడ కూడా చిన్నదే. దానిది తెల్లటి రంగు. కాని ఒంటినిండా నల్లటి మచ్చలున్నాయి. వాటివల్ల దానికి ఎంతో అందం వచ్చింది. ఆ దూడ అసలే పడుకోదు. ఒకవేళ ఎప్పుడైన పొరబాటున పడుకుందో యిక చూసుకోండి—పిల్లికూనల ఆగడం! గంగ దాని ముఖం దగ్గర చేరేది. రంగ తోక లాగేది. మంగ కాళ్ల దగ్గర కూర్చునేది. మూడు

కూనలూ చేరి మ్యావ్ మ్యావ్‌మంటూ అల్లరి చేస్తూ ఉంటే అవుదూడకు శివమెత్తినట్లయ్యేది. తోక పైకెత్తి కాటుక కళ్లను మెరిపిస్తూ, చెంగుచెంగున ఎగురుతూ ఉండేది. అది అలా ఎగిరినప్పుడు దాని మెడలో నల్లటి వెంట్రుకల తాడుకు కట్టిన కంచు మువ్వలు ఘల్లుఘల్లుమనేవి. ఆ చప్పుడుకు పిల్లికూనలు అదిరిపడి, ఇల్లంతా పరుగులు తీసేవి. ఆ సందడిలో పిల్లికూనలు అవుదూడా ఒకదాని వెనుక ఒకటి పరుగెత్తి, ఆడుతూ ఉంటే, చొప్పకట్టెలు చెల్లాచెదురై యింటినిండా పడుతూ వుండేవి. పిల్లి కూనలు వాటిపైకి ఎక్కి దూకుతూ ఆడుతూ అవుదూడతో అలా అలా స్నేహం చేసుకున్నాయి.

గంగ, మంగ, రంగ ఆ యింటికి వచ్చి అప్పుడే మూడు రోజులయింది. మూడు రోజులూ మూడు నిమిషాలలా గడిచాయి వాటికి. ఆ సాయంత్రం చీకటి పడుతుండగా పెద్ద పిల్లి వచ్చి ఆ కూనలను నోట కరచుకొని ఒక పెద్ద హొటలుకు చేర్చింది.

ఆ హొటల్లో ఒక గది మరో మూలగా వుంది. అంతా చీకటి చీకటిగా ఉంది. ఆ గదిలో ఒక మూల ఒదిగి ఒదిగి ఉండటం ఆ కూనలకు కష్టమనిపిస్తున్నది. అన్నిటికంటే గంగ అసలే వుండలేకపోతున్నది. అప్పుడప్పుడు వంటయింటి ముందరగా అటూ ఇటూ తిరిగి అన్నీ జాగ్రత్తగా గమనిస్తూ వుండేది. ఎవరయినా కనబడగానే ఒక్క పరుగున గదికి వచ్చి చేరేది. భోజనాల యింటి కిటికి ఎక్కి దూకుతూ వుండేది. అక్కడ వున్న వాళ్లందరూ ఇస్సుమంటూ అవతలికి నెట్టివేస్తూ వుండేవారు. గంగ వెంబడి వచ్చిన రంగ బయటికి రాగానే దానివెంబడి పరుగులు తీసేవి.

అప్పటికి గంగ, మంగ, రంగలు కొంచెం పెద్దవయ్యాయి. ఆ సంగతి తల్లి కూడా గ్రహించింది. పిల్లలు పెరుగుతున్నకొద్దీ తల్లికి ఒక కొత్త ఆలోచన కలగటం మొదలుపెట్టింది.

'ఇంతకాలంనుండీ పిల్లిజాతికి ముఖ్యమయిన ఆహారం ఎలుక. అది నిజంగా అసహ్యమైనది. సృష్టిలో ఎన్నో రకాల ఆహార పదార్థాలు వున్నాయి కదా! వాటితో ఆకలి తీర్చుకోవచ్చు. ఈ ఎలుకను చంపి తినే అసహ్యకరమైన అలవాటు నా పిల్లలకు ఎలాగయినా తప్పించాలి' అని గట్టిగా తీర్మానించుకున్నది.



తన పిల్లలను ఎంతో ప్రేమతో గారాబంగా పెంచుతున్నది. దానికి తోడు ఆదర్శప్రాయంగా కూడా పెంచింది. పిల్లి జాతిలో పేరు ప్రతిష్ఠ సంపాదించాలనుకున్నది. పిల్లిజాతి జాతినే కొత్త బాటలో నడిపించాలనుకున్నది. ఆహార విషయంలో సంస్కరించిన తరువాత మిగతా అన్ని విషయాల్లో కూడా క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టవచ్చునని ఆశించింది తల్లిపిల్లి.

పెద్దపిల్లి ఆలోచనలకు తగినట్టుగానే ఆ హోటల్లో అనేక రకాల బిస్కెట్లు, వెన్నరాచిన రొట్టెముక్కలూ సమృద్ధిగా దొరికేవి.

హోటలుకు వచ్చిన వాళ్లందరూ వెళ్లిపోయిన తరువాత బల్లలు శుభ్రపరచేముందు కూనలను తీసుకుని పెద్దపిల్లి ఆ గదిలోకి వెళ్లేది. ఆ

బిస్కెట్లు ఆ రొట్టె ముక్కలూ తప్ప తన ముద్దుకూనలు మరే చెత్త పదార్థము తినగూడదని అనుకునేది. కనుక పెద్దపిల్లి క్రింద పడివున్న బిస్కెటు ముక్కలూ, రొట్టె ముక్కలూ అన్నిటినీ ఒకచోట చేర్చేది. ఆ కూనలు మూడూ బల్లల మీదికి ఎక్కి వాటిని తింటూ ఉండేవి.

ఈ మాదిరిగా పిల్లికూనలు బిస్కెట్లూ రొట్టెముక్కలూ ఎంతగా తింటూవున్నా వాటికి కడుపు నిండినట్టుగా ఉండేది కాదు. కడుపునిండా తిన్నప్పటికీ ఏడుపు ముఖాలతో తిరిగేవి. ఆ మూడు కూనలకు ఉండ వలసిన ఉత్సాహమూ, శక్తీ వాటిలో కనబడేవి కావు.

ఈ సంగతి గ్రహించినా తల్లి తన నిశ్చయాన్ని మార్చుకోదలచుకోలేదు. తొందరపడి తన ముద్దుకూనలకు మరొక వస్తువును రుచి చూపించదలచ లేదు. ఆ పిల్లల మీద ఉన్న ప్రేమ చేతనే కదా క్రొత్త పద్ధతిలో వాటిని పెంచి, వాటి జీవితాలను తీర్చిదిద్దాలనుకున్నది? అందుచేత వాటి నిరు త్సాహానికి, మందకొడితనానికి కారణం తెలిసినప్పటికీ, మనసు మార్చు కోకుండా యింకా గట్టి చేసుకున్నది తల్లి.

కాని, తానుమాత్రం పగలంతా అటూ యిటూ తిరిగి పెదవులు నాకుకుంటూ వచ్చేది. ఒకరోజు మంగ ఆకలికి ఆగలేక 'అక్కా! ఆకలే' అన్నది.

'వెధవ రొట్టె ఎంత తిన్నా ఆకలి చావటం లేదు' అన్నది రంగ జవాబుగా.

'అవునే! నాకూ అలాగే వున్నది. అమ్మ మనకు ఇంకేమైనా పెడితే బాగుండును. ఎట్లామరి? లేకపోతే మనమే ఏదయినా చూసుకోవాలి మరి' అన్నది మంగ.

'అమ్మకు మాత్రం ఈ చప్పటి రొట్టెబిస్కెట్టూ ముక్కలతో కడుపు నిండుతున్నదంటావా? ఏమో మరి?' అన్నది రంగ.

'ఆ! అమ్మ ఈ తవుడు బిస్కట్టు ముక్కలు ఎందుకు తింటుంది ? మూతి పొడుగ్గా వుండి, చిన్నచిన్న కళ్లూ, సన్నటి పొడుగుపాటి తోక

ఉన్నదేదో ఒక కమ్మనిది—గబగబా పరుగెత్తుదాన్ని పట్టుకుని తింటుంది. ఆదేదో జంతువై ఉంటుంది. అమ్మ దాన్ని ముందుకాళ్లతో పట్టుకుని పళ్లతో చీలి తింటుందే' అన్నది గంగ.

'ఆ! నీకెవరు చెప్పారే గంగా?' అన్నది రంగ ఆశ్చర్యంతో.

'నీకెట్లా తెలుసే?' అన్నది కనుబొమలు పైకెత్తి మంగ.

అంతలో తల్లి వచ్చింది పెదవులు నాక్కుంటూ, 'చూడు చూడు! అమ్మ నోటినుంచి కమ్మటి వాసన ఎట్లా వస్తున్నదో?' అన్నట్టు రంగ మంగల వైపు చూసి, తోక పైకెత్తి మ్యావ్ మ్యావ్‌మంటూ తల్లి చుట్టూ తిరిగింది గంగ.

కొంతసేపటికి మూడు పిల్లికూనలూ ఏమీ ఎరగనట్టు గోడవారగా పొంచిపొంచి నిటారుగా నిలబడ్డాయి. వాటిని చూడగానే 'ఏదో ఆలోచనలో పడ్డాయ'ని తల్లి గ్రహించింది.

'ఏమిట్రా అల్లా నిలబడి చూస్తున్నారు? భయపడ్డారా ఏమిటి?' అంటూ వాటిని దగ్గరికి తీసుకుని 'అమ్మాయిలూ! బిస్కట్లు ఒంటికి చాలా మంచివి తెలుసా? వాటిలో వెన్న ఉంటుంది. చక్కెర ఉంటుంది. అవి దేహానికి బలాన్నిస్తాయి. రొట్టె శరీరానికి పుష్టినిస్తుంది. వీటన్నిటివల్లా దేహానికి మంచి ఆరోగ్యం కలుగుతుంది' అని పిల్లల ఒంటి మీద చెయ్యి వేసి ప్రేమతో నాలుకతో నాకింది.

'ఏమన్నా చెప్పు. వాటితో మాకు ఆకలి తీరటం లేదే అమ్మా!' అన్నది మంగ.

'నా కడుపు మలమల మాడిపోతున్నదే అమ్మా!' అన్నది రంగ.

'అమ్మా! నిజంగా నీవు చెప్పు....నీవూ వాటినే తింటున్నావా?' అన్నది రంగ.

'ఏమిట్రా ఈ పిచ్చి ప్రశ్నలు? యివాళ ఏమైంది మీ కందరికి? యివిగాక నేనేం తింటున్నానని మీ అనుమానం? నేను పుట్టినప్పటినుంచీ

యిదే తింటున్నాను. మీరుకూడా వీటినే తినాలి. పిల్లలు తల్లి చెప్పినట్టు వినాలి. తల్లి మాటను ఎదిరించకూడదు. తెలిసిందా?' అన్నది తల్లిపిల్లి.

రంగ, మంగ, గంగలు ముఖాలు మాడ్చుకున్నాయి. కొపంతో మూడు అలాగే గోడవారగా నిలబడ్డాయి.

తల్లి పిల్లి కూనలు యిట్లా మాట్లాడుకుంటూ ఉండగానే సామాను గదిలోనుంచి ఒక ఎలుక పరుగెత్తుతూ ఉండటం తల్లి కంటపడ్డది. చంగున ఒక్క అంగలో అటు దూకి, తల్లిపిల్లి ఎలుకను చటుక్కున చంపి, అవతలికి ఈడ్చుకుపోయి కొరికి కొరికి తినటం మొదలుపెట్టింది.

గంగ మంగ వైపు రంగ వైపూ చూసింది—'నా మాట ఇప్పుడైనా నమ్ముతారా లేదా?' అన్నట్లు కళ్లతో ప్రశ్నించింది.

ఆ మరునాడు తల్లి మళ్లీ అక్కడికి వచ్చింది. 'బిస్కెట్లు, పాలు, రొట్టె ఒంటికి చాలా మంచివి, నా మాట విని వాటినే తినండి' అని చెప్పడం మొదలుబెట్టింది.

తల్లి మాట పూర్తి కాకమునుపే గంగ సామాను గదిలోకి దూరి ఒక ఎలుకను చంపి తీసుకువచ్చింది. తల్లి యెదుటే రంగకూ మంగకూ పెట్టి తానూ తిన్నది.

అప్పుడనుకున్నది తల్లి—'ఏ జాతికి ఏది ఆహారమో దానిని మార్చటానికి వీలు కాదు. చిన్న చిన్న విషయాలలో మార్చటం చేర్చటం చేయవచ్చుగాని ప్రధానమైన వాటిని మార్చాలని ప్రయత్నించటం చాలా తెలివితక్కువ' అని తల్లి దిగాలుపడి పడుకుని ఆలోచిస్తుంటే మూడు కూనలూ ఇన్నాళ్లకనాడు రుచికరమైన ఆహారం తిని, వికసించిన ముఖాలతో గంతులు వేస్తూ తల్లిని ఆనుకుని నిలబడ్డాయి.

'ఏదో భ్రమపడి, యిన్నాళ్లనుంచీ మీకు కావలిసిన వస్తువును తెచ్చి పెట్టలేకపోయాను. ఈనాటినుంచీ మీరే మీ కిష్టమయిన ఆహారాన్ని వెతుక్కుని తృప్తిగా తినండి. నా అభ్యంతరం ఏమీ లేదు' అన్నది ఆ మూడు కూనలను ఆదరంగా దగ్గరికి తీసుకుంటూ తల్లిపిల్లి.